

"ప్రతిజ్ఞాపాలన" లో రాజశ్రీ.

# నేడే చూడండి!




విక్రమ్ ప్రొడక్షన్స్‌వారి

# చంద్రహాస

రచన
సదాశివబ్రహ్మం

సంగీతం
క.హనుమంతరావు

నిర్మాత, దర్శకుడు: B.S.రంగా



నవయుగ

# ఓర్వో కలర్

రంగు చూస్తూనే అందులోని ఆకర్షణీయతను ఓర్వో కలర్ ఫిల్మ్‌తో సాధించండి. బ్లాక్ అండ్ వైట్ ఫిల్మ్ లాగే దీన్ని ఉపయోగించడం చాలా సులభం. ఓర్వో కలర్ ఫిల్మ్, కలర్ ఫిల్మ్ తయారీలో మార్గదర్శి, ఐరోపాలోకంతటికి పెద్దది అయిన విఇబి ఫిల్మ్‌ఫాబ్రిక్ వుల్ఫెన్ జర్మన్ డెమోక్రాటిక్ రిపబ్లిక్ కర్మాగారంలో తయారయ్యే వాణిజ్యమైన ఉత్పత్తి.

ప్రోసెసింగ్ సౌకర్యాలు ఇండియాలో లభిస్తాయి. మీకు సమీపంలోని ఓర్వో డీలర్ ద్వారా వివరాలు తెలుసుకోండి.




**VEB FILMFABRIK WOLFEN**
German Democratic Republic
ఓర్వో ఫిల్మ్స్ ఈస్టర్న్ యూనిట్
మద్రాసు-2 ■ కలకత్తా-13

SGS/4/65 TEL

Roopkala

ఉత్తమ అభిరుచులతో ఉత్కంఠభరితంగా

కొత్త పోకడలతో నిర్మించిన కుటుంబ గాథ..

విధిని సైతం ఎదిరించే విభిన్న వ్యక్తుల సంఘర్షణ

విధిగా చూడవలసిన విలక్షణ చిత్రం..

హైదరాబాద్ మూవీస్




# కీలుబొమ్మలు

దర్శకత్వం: సి.యస్.రావు

నిర్మాత: పి.గంగాధర రావు



REVATHI

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 21—5—'65
విశ్వావసునామ సం॥ వైశాఖమాస బహుళ షష్ఠి
సంపుటము : 57 సంచిక 38

స్థాపితము :
1908
*
ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్
*
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ
*
ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీథి, మద్రాసు-1

## చందా వివరాలు

ఇండియా రూ. 15 60. ఇతర దేశాలు ఓడమీద ( Sea Mail ) రూ. 28 60. విమానం ద్వారా (Air Mail) బ్రిటన్, జర్మనీ, ఇతర యూరోప్, ఆఫ్రికా దేశాలు రూ. 120 00. అమెరికా రూ. 176.80. ఆస్ట్రేలియా రూ. 148.20.

| | |
|---|---|
| విడిప్రతి | 30 పై. |
| సంవత్సర చందా | 15 60 పై. |
| 6 మాసాల చందా | 7.80 పై. |


## మనలో మాట

తెలుగు నటీనటుల వ్యాసాలే కాకుండా హిందీ, హాలీవుడ్ తారలకి సంబంధించిన వ్యాసాలు ఎన్నో 'ఆంధ్రసచిత్ర వారపత్రిక'లో వేశాము. ఈ వారం రీటా హేవర్త్ స్వయంగా వ్రాసిన ఆరు వ్యాసాలలో మొదటిది వేస్తున్నాము. 28 వ పేజీలోని బొమ్మ కొలంబియా పిక్చర్స్‌వారి ప్రాంతీయ ప్రతినిధుల కార్యాలయం వారు ఇచ్చారు...

* * *

పై వ్యాసం తర్వాతి పుటలలో డా. నళినీమోహన్‌గారి వ్యాసం ఒకటి వేశాము. వీరు మాస్కో విశ్వవిద్యాలయంలో ఫిజిక్స్‌లో 'డాక్టరేటు' పుచ్చుకున్నారు. 'బాలసాహితి'లో వీరి కథలు కొన్ని ప్రచురిస్తూ వస్తున్నాము...

* * *

పాఠకులకి మనవి— కొందరు పాఠకులు కొందరు రచయితల చిరునామాలకోసం వ్రాస్తూ ఉంటారు. అవి రచయితల అనుమతి లేనిదే బయటపెట్టలేము కాబట్టి వ్రాసేవారి ఎడ్రసులు కావలసినవారు తమ ఉత్తరాలు కవర్లలోనే వ్రాసి అందులో 15 నయాపైసలు కల మరొక కవరు జతపరచినట్లయితే వారి ఉత్తరాలని ఆ ఆ రచయితలకి మేము పంపగలుగుతాము.

### చందాదారులకు...

ఆంధ్ర సచిత్ర వారపత్రిక, భారతి పత్రికలకు చందా పంప గోరేవారు, మా మద్రాసు కార్యాలయానికి పంపాలి. ఇందువల్ల పత్రికలను త్వరగా పంపటానికి వీలవుతుందని గమనించ గోరుతున్నాము.

సర్క్యులేషన్
మేనేజర్.

## విషయానుక్రమణిక

ముఖచిత్రం : 'ప్రేమించి చూడు'లో రాజశ్రీ


కెయిరోలో అబ్దుల్లా ఆర్భాటం
అబ్దుల్లా బెదరింపులు
చైనా వెళ్లేందుకు అబ్దుల్లా సిద్ధం
తిరిగి వచ్చేటప్పుడు మాత్రం అబ్దుల్లా బుద్ధిమంతుడే


శిక్షించడానికి ఇది సరైన సమయం కాదు
బయటి ప్రమాదం
బాల్యావస్థలో ఉన్న ప్రతిపక్షం


పాకిస్తాన్ బెదరింపుల దృష్ట్యా నాకు ప్రధాని కాగల అవకాశం ఏమైనా ఉందా?


అవి ఒకదాన్నొకటి కబళిస్తాయి
అతివాద వామపక్ష కమ్యూనిస్టులు
డాంగే
నంబూద్రిపాద్

# ట్విన్ టస్కర్

## వస్త్రాలైనా...
## కళ్లు మూసుకొని కొనవచ్చును!







**మీరు కోరే నాణ్యత, మన్నిక ట్విన్ టస్కర్‌లో కనిపిస్తాయి...**

మధురై మిల్లుల పేరు, కీర్తిప్రతిష్ఠలతో తులతూగే దివ్యమైన యీ వస్త్రాలమీద మీరు నిశ్చింతగా ఆధారపడవచ్చును. ట్విన్ టస్కర్ 'డ్రిల్' రకాలూ, ఇతరమైన 'కేంబ్రిక్' రకాలు గట్టివే కాకుండా, చిరకాలం మన్నుతాయికూడా. ఎన్ని ఉతుకులు పడినా, వస్త్రంలోని నైపుణ్యమూ నాజూకుతనమూ తగ్గవు. ట్విన్ టస్కర్‌ను గుర్తుంచుకోండి—అంతటి చవకైన ధరలకు ఇంతటి నాణ్యతకల మరేవస్త్రాలూ లభించవు.

ట్రౌజర్లకు ట్విన్ టస్కర్ డ్రిల్ రకం వాడుకోవచ్చును. బ్లౌజులకు, లాల్చీలకు, పైజామాలకు, దిండు గలీబులకు, పరుపు గలీబులకు వన్నెవి, తెల్లవి, అందమైన 'కేంబ్రిక్' వాడండి

ట్విన్ టస్కర్ తయారుచేయనున్న మరికొత్త రకాలకోసం ఎదురుచూడండి.

**మధురై మిల్స్ కంపెనీ లిమిటెడ్, మధురై.**

నాణ్యతగల మాలకు ప్రపంచ ప్రసిద్ధి పొందినది

మేనేజింగ్ ఏజెంట్లు: ఏ. & యఫ్. హార్వే లిమిటెడ్.




డ్రిల్. కేంబ్రిక్



మీ ముఖము యొక్క
శోభను
రక్షించుకొనుటకు...


ఒక ప్రత్యేకమైన సౌందర్య సాధనము


వర్ణమును శుభ్రపరుస్తుంది


మరియు పోషణనిస్తుంది


హాయినిచ్చే లనోలిన్ చేర్చబడినది


ఏ మాత్రమూ జిగురుగా ఉండదు


మీ ముఖ కాంతి సుందరముగా
([illegible])


దీనిని క్రమము తప్పకుండా వాడండి




లిక్విడ్ క్రీమ్

# పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్కం పౌడర్

**తాజా హాయికి, చెమట పీల్చడానికి, కమ్మని పరిమళానికి ఉత్తమమైనది**

Pond's
*Dreamflower talc*

స్నానం చేసిన తరవాత పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్కం పౌడరు ఒంటినిండా అద్దుకొని (చాలాసేపు) నిలిచే తాజాతనాన్నీ, సువాసననూ పొందండి. అతి నాజూకైన సువాసనతో కూడిన యీ టాల్కం పౌడరు క్షణంలో చెమటను పీల్చి, ఏ వాతావరణంలోనైనా, రోజంతా ఆహ్లాదకరమైన చల్లదనాన్నీ, తాజాతనాన్నీ చేకూరుస్తుంది. ఇంటిల్లిపాదికీ యీ పౌడరు ఎంతో ఆదర్శమైనది.

చీస్‌బ్రో-పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్

**ప్రతి కుటుంబానికి అందుబాటులో ఉండే అపురూప టాల్క్**

*Dreamflower talc*

# న్యూఢిల్లీ లేఖ

వానూను అంగీకరించలేదు. అతన్ని రక్షించటానికి మిలిటరీయేకాక, దురాగతాలను జరిపేవారిని, వారి వెనుకఉన్న విశ్వ విద్యాలయంలోని పాకిస్తాన్ విద్రోహ శక్తుల్ని ఎదుర్కొనటానికి యంత్రాంగాన్ని కూడా అమర్చవలసి ఉంటుంది.

శ్రీ చాగ్లా తలపెట్టిన క్లిష్టతరమైన ఈ ఉద్యమం వెనుక ఇండియా పూర్తి సహకారం ఉన్నది.

*　　*　　*

నాలుగో ప్రణాళికకి ఇండియాకి రావాల్సిన విదేశీ సహాయం అసలు రూపం ఇప్పుడిప్పుడే మెల్లిగా బయటపడుతున్నది. న్యూఢిల్లీ రిపోర్టులని బట్టి చూస్తుంటే పెద్ద మొత్తమైన అమెరికా సహాయం ఆశాజనకంగా లేదనిపిస్తుంది. బ్రిటన్‌లా అమెరికా కూడా తన దేశంలోనుంచి బయటికివెళ్లే మొత్తాలపై నియమాలను, ఆంక్షలను విధించింది.

నాలుగో ప్రణాళికలో 30 మిలియన్ల పౌన్లు బ్రిటన్‌నుంచి లభిస్తుంది. ఇంతకుముందు దుర్గాపూర్ రెండవ అభివృద్ధి పథకానికి ఇస్తామన్న 60 మిలియన్ల పౌన్లతో ఆ మొత్తం చేరుతుంది.

ప్రాజక్టులు ముఖ్యమైనవైనా, కానివైనా వాటి నిర్వహణకు, దిగుమతులకి ఈ విదేశీ సహాయం లభిస్తుంది. ఈ సహాయం దుర్గాపూర్ రెండో అభివృద్ధి పథకానికి కావలసిన మొత్తంపై ఆధారపడి ఉంటుంది. ఉదాహరణకి—దుర్గాపూర్ రెండో అభివృద్ధి పథకానికి సాలుకు 20 మిలియన్ పౌన్లు కావాలంటే మొదటి మూడు సంవత్సరాలకి ఇండియా 10 మిలియన్ల సహాయాన్ని మాత్రమే పొందగలుగుతుంది. ఇతర దిగుమతులకు—ముఖ్యమైనా కాకపోయినా సరే!

ఈ పద్ధతినిబట్టి చూస్తుంటే ఇండియా అయిదవ ఉక్కు కర్మాగారానికి కూడా బ్రిటిష్ సహాయం పెద్ద మొత్తాల్లో లభించటం ఎంత అసాధ్యమో వూహించవచ్చు.

—శ్రీకృష్ణ ★

## 21-5-1965 శుక్రవారం మొదలు
## 27-5-1965 గురువారం వరకు.

**మేషం:** వృత్తి వ్యాపారాల్లో మీరు యిదివరకు ప్రారంభించిన వ్యవహారాలను యిప్పుడు పూర్తిచేయగలరు సాహసముతో కూడిన వ్యవహారములు కూడా వారం ప్రారంభంలో లాభిస్తాయి భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. ప్రయాణాల్లో ప్రయోజనం కంటె ప్రయాస అధికంగా ఉంటుంది ఇతరులకు ఉపకారం చేయడానికి ప్రయత్నించడంవలన ఉద్యోగంలో వారాంతంలో శ్రమకు గురి కాగలరు ఆరోగ్యం ఇదివరకటికంటె బాగా ఉంటుంది.

స్త్రీలకు—కుటుంబ కార్యక్రమాలు నిరాటంకముగా నెరవేరతాయి సంతోషకరమైన వార్తలను వింటారు.

**వృషభం:** గడచిన వారంకంటే యీవారం అనుకూలంగా ఉంటుంది. వ్యాపారంలో మీ అభిప్రాయాలు సరియైనవని రుజువు కావడంవలన ఆదాయంతోబాటు పాటివారిలో గౌరవం కూడా లభిస్తుంది. వృత్తిలో కొంతమంది వ్యక్తులు మీకు నష్టం కలిగించడానికి చేసే ప్రయత్నాలు మీకు లాభదాయకంగా మారతాయి స్థిరాస్థి వ్యవహారాలు మాత్రం అనుకూలంగా ఉండవు రాజకీయ వ్యవహారాల్లో నూతనోద్యమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి కుటుంబ సంతోషం లభిస్తుంది

స్త్రీలకు—ఆరోగ్యం బాగానే ఉన్నా కొంచెం బలహీనత కన్పిస్తుంది బంధువర్గాల్లో గౌరవం బాగా ఉంటుంది

**మిథునం:** ఈవారం కూడా విశేషమైన అనుకూలతను ఆశించడానికి అవకాశంలేదు వారం ప్రారంభంలోనే వృత్తి వ్యాపారాల్లో చికాకులు ఏర్పడి వారాంతానికి సర్దుకొంటాయి వ్యాపారంలో కొన్ని అవకాశాలు యింద్రధనుస్సువలె ఆకర్షణీయంగా కన్పిస్తాయిగాని అవి కార్యరూపాన్ని ధరించడం కష్టం వృత్తిలో కొంతమంది వ్యక్తులు మిమ్మల్ని రెచ్చగొట్టి మీ ద్వారా తమ పనుల్ని సాధించుకొనడానికి ప్రయత్నంచేస్తారు సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది పాటివారిలో గౌరవం బాగా ఉంటుంది.

**కర్కాటకం:** వారంమధ్యలో ఆందోళనకలిగించే పరిస్థితులు ఏర్పడినా, వారాంతానికి వృత్తి వ్యాపారాల్లో తగినంత అభివృద్ధిని సాధించగలరు వ్యాపారంలో మీ కార్యక్రమాలు చురుకుగా సాగడంవలన ఆదాయం పెరుగుతుంది. వృత్తిలో నూతనావకాశాల కోసం చేసే ప్రయత్నాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ఉద్యోగంలో మీ పరిస్థితి సంతృప్తికరంగా ఉంటుంది. సాంఘిక కార్యక్రమాల్లో మీకు ముమ్ముందు ఉపయోగించగల పరిచయాలు ఏర్పడతాయి. ఆర్థిక వ్యవహారాలు బాగా ఉంటాయి.

| మీ | మే | వృ | మి |
| --- | --- | --- | --- |
| | బు | ర<br>గు శు రా | |
| శ | వారఫలం | | |
| చం | మహేష్ | | కు |
| | కే | | |

స్త్రీలకు—ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. శుభకార్యాల విషయంలో అనుకూల వార్తలను వింటారు

**సింహం:** మీస్వంత వ్యవహారాల మాట ఎలాగ ఉన్నా, యితరుల వ్యవహారాల్లో మీ ప్రయత్నాలు నిరాటంకంగా నెరవేరతాయి. వ్యాపారంలో మీరు యిదివరకు కొన్ని వ్యవహారాలను నిర్లక్ష్యం చేయడంవలన ఇప్పుడు మీరు పొందవలసినంత ప్రయోజనాన్ని పొందలేని పరిస్థితి ఏర్పడుతుంది అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు కొంచెం శ్రమమీద నెరవేరి లాభిస్తాయి దూర ప్రయాణాలు వాయిదా వేయడం మంచిది స్థిరాస్థి వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి ఆడంబరం కోసం వ్యయం జరుగుతుంది పుణ్యకార్యాలు చేస్తారు

**కన్య:** అప్పుడప్పుడు వృత్తి వ్యాపారాల్లో కొన్ని అవాంఛనీయమైన పరిస్థితులు ఏర్పడినా, మొత్తంమీద ఈవారం బాగానే ఉంటుంది వ్యాపారంలో క్రమాభివృద్ధిని సాధించగలరు తాత్కాలికమైన మొగమాటాలకు లొంగిపోయి డబ్బుకు సంబంధించిన వాగ్దానాలు చేయడం మంచిదికాదు. వృత్తిలో అనుకూలవార్తలను వింటారు కోర్టు వ్యవహారాలు మీరు అనుకొన్నంత బాగా ఉండకపోవచ్చును రాజకీయ వ్యవహారాల్లో ప్రయోజనకరమైన మార్పులు వస్తాయి అనారోగ్య సూచనలు ఉన్నాయి

స్త్రీలకు—ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది సాహిత్య కళారంగాల్లో మీ కృషి రాణిస్తుంది

**తుల:** ఈవారం మీరు ఆర్థిక వ్యవహారాల్లో కంటే ఆరోగ్యవిషయంలో జాగ్రత్తగా వ్యవహరించడం అవసరం. వృత్తి వ్యాపారాల్లో మీకార్యక్రమాలు ఒడుదుడుకులు లేకుండా సాగిపోతాయి వారాంతంలో పాటివారితో భేదాభిప్రాయాలు రాగల సూచనలు ఉన్నాయి వృత్తిరీత్యా చేసే ప్రయాణాలు ప్రయోజనకరంగా ఉంటాయి. ఉద్యోగంలో మీపరిస్థితి యిదివరకటి కంటే బాగా ఉంటుంది. బంధువుల వ్యవహారాల్లో మీరు శ్రమపడి కృషి చేసినా మాటదక్కక పోవచ్చును.

> **ఈ వారం ధరలు**
>
> ఆవరాల ధరలు వారం ప్రారంభంలో కొంచెం తగ్గి మరల వారాంతానికి పెరుగుతాయి. బెల్లం ధరలో పెద్ద మార్పులు యేమీరావు. చింతపండు ధర కొంచెం తగ్గవచ్చును. నూనె, నువ్వుల ధరలు కొంచెం పెరుగుతాయి వస్త్రాల ధరలు తగ్గవచ్చును.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. వినోదకాలక్షేపాల్లో పాల్గొంటారు.

**వృశ్చికం:** మీరు యీవారం ఘన విజయాల్ని యేమీ సాధించలేకపోయినా, యిదివరకు యేవో కారణాల వలన నిలిచిపోయిన వ్యవహారాలను యిప్పుడు పూర్తి చేయగలగడం వలన సంతృప్తికరంగా ఉంటుంది. ఖరీ యెత్తున చేసే వ్యాపారాల్లో యితరుల జోక్యం వలన నష్టం రావచ్చును. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. కోర్టు వ్యవహారాల్లో ప్రతికక్షులు బలహీనపడే సంఘటనలు జరుగుతాయి. ఆర్థిక వ్యవహారాల్లో ప్రముఖపాత్రను నిర్వహించగలరు.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి. విలాసవస్తువులు కొంటారు

**ధనుస్సు:** ఆదాయంబాగానే ఉన్నా, వృత్తి వ్యాపారాల్లో కార్యసాధనకోసం మీ అభిప్రాయాలకు వ్యతిరేకంగా ప్రవర్తించవలసిన పరిస్థితి యేర్పడుతుంది వ్యాపారంలో మీకు ముమ్ముందు లాభించగల మార్పులు వస్తాయి వృత్తిలో పాటివారితో కలహప్రవసంగం రాగల సూచనలు ఉన్నాయి. ఉద్యోగంలో యితరులు చేసిన పొరబాటులవల్ల మీరు శ్రమపొందవలసి వస్తుంది సాహసముతో కూడిన వ్యవహారాలు కొంతవరకు లాభిస్తాయి. ఆరోగ్యం బాగానే ఉన్నా మానసికాందోళన కలుగుతుంది

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో అనుకూలమైన మార్పులు వస్తాయి ఎవరితోనూ మాట పట్టింపులకు దిగడం మంచిదికాదు

**మకరం:** గ్రహబలం అనుకూలంగా ఉంది అన్ని వ్యవహారాల్లో ధైర్యంగా ముందడుగు వేయవలసిన సమయం వృత్తి వ్యాపారాల్లో మీకార్యక్రమాలకు కొన్ని ఆటంకాలు వచ్చేటట్లు కన్పిస్తాయిగాని మీరు సమయస్ఫూర్తితో వ్యవహరించడం వలన వాటిని అధిగమించడమే కాకుండా తగిన అభివృద్ధి సాధించగలరు. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలకంటే మీరు స్వంతంగా చేసే వ్యాపారాలు లాభదాయకంగా ఉంటాయి సాహిత్యకళా రంగాల్లో మీకృషి రాణిస్తుంది.

స్త్రీలకు— ఆరోగ్యం ప్రస్తుతం బాగా ఉన్నా నిర్లక్ష్యం చేయుటతగదు. సంఘసేవికలకు మంచి సమయము.

సింహం : ఈ వారం ప్రారంభంలోనే మీరు కొన్ని అనవసరమైన వ్యవహారాల్లో చిక్కుకొనడం వలన తరువాత ప్రయోజనకరమైన పనుల్లో కూడా తగినంత శ్రద్ధ చూపించలేని పరిస్థితి యేర్పడు తుంది. భారీయెత్తున చేసే వ్యాపారాలు వాయిదా వేయడం మంచిది వ్యాపారంలో వారం మధ్య నుంచి అనుకూల పరిస్థితి యేర్పడుతుంది వృత్తిలో ప్రయోజనకరమైన వార్తలను వింటారు ప్రయాణాలు కొంచెం శ్రమమీద ఫలిస్తాయి. ఆరోగ్యం బాగానే ఉంటుంది. దైవకార్యాలు నెర వేరుతాయి

స్త్రీలకు— కుటుంబ కార్యక్రమాలు బాగా ఉంటాయి సాంఘిక వ్యవహారాల్లో మీ ప్రాముఖ్యత పెరుగుతుంది

# వారఫలం

మీనం : ఈవారం చిత్రంగా ఉంటుంది కొన్ని వ్యవహారాలు మీరు యెంత ప్రయత్నంచేసినా నెరవేరకపోవడం, మరికొన్ని వ్యవహారాలు నాటంతట అవి సానుకూలపడడం వంటి సంఘటనలు జరుగు తాయి మీరు యెంత జాగ్రత్తగా ఉన్నా వారం మధ్యలో అధికవ్యయం జరగడంవలన ఆర్థికంగా యిబ్బంది రావచ్చును ఉద్యోగంలో కార్యభారం పెరిగినా, మీకృషిని అధికారులు గుర్తించగలరు రాజకీయ వ్యవహారాల్లో ప్రతిపక్షాల హడావుడి అధికంగా ఉంటుంది సజ్జన సాంగత్యం లభి స్తుంది

స్త్రీలకు— ఆరోగ్యం బాగానే ఉంటుంది బంధువులకు సహాయం చేస్తారు ప్రయాణాలో చనలు చేస్తారు ★

# జన్మదినఫలం

## మే-21

ఈ సంవత్సరం అన్ని విధాలా అనుకూలంగా ఉంటుంది వృత్తి వ్యాపారాల్లో మీరు ఇంతవరకు వూహించని అవకాశాలు లభిస్తాయి భాగస్వాములతో కలిసిచేసే వ్యాపారాలకంటే మీరు స్వంతంగాచేసే వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి కొన్ని వ్యవహారాల్లో అనవసరమైన వ్యయం జరగడం వలన అప్పుడప్పుడు ఆర్థికంగా ఒత్తిడి రావచ్చును ఉద్యోగంలో ఉన్నతస్థానం లభించగల సూచనలు ఉన్నాయి ఇదివరకు మీవల్ల ఉపకారం పొందిన బంధువులే ఇప్పుడు మీమీద దుష్ప్రచారం చేస్తారు సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది అప్పు డప్పుడు స్వల్పనారోగ్యం చేస్తుంది దైవ కార్యాలు నెరవేరుతాయి విద్యార్థులకు సెప్టెంబరు పరీక్షలు బాగా ఉంటాయి.

## మే-22

ఈ సంవత్సరం ప్రారంభంలో సామాన్యంగా ఉన్నా రాను రాను అన్ని వ్యవహారాల్లోను అను కూల పరిస్థితులు ఏర్పడతాయి వ్యాపార విస్తరణ ప్రయత్నాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి సంవత్స రాంతంలో అధికారులవలన జరగవలసిన వ్యవహా రాలు సులువుగా నెరవేరడంవలన అదనపు లాభాన్ని పొందగలరు వృత్తిలో నూతన మార్గాల ద్వారా ఆదాయం పెరుగుతుంది ఉద్యోగంలో కొంతమంది వ్యక్తులు మీ మంచితనాన్ని ఆధారంగా చేసికొని అక్రమ లాభాన్ని పొందడానికి ప్రయత్నిస్తారు ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది రాజకీయ వ్యవ హారాల్లో, నూతనోద్యమాల్లో విజయాన్ని సాధించ గలరు విద్యార్థులు ఏప్రిల్ పరీక్షల్లో మంచి మార్కు లతో కృతార్థులు కాగలరు.

## మే-23

వృత్తి వ్యాపారాల్లో ఆదాయం బాగానే ఉన్నా ఇంతవరకు మీకు సన్నిహితంగా ఉన్నవారికి వ్యతిరేకం గాను, ఇతరులకు సన్నిహితంగాను వ్యవహరించ వలసిన అవసరం ఏర్పడడంవలన ఈ సంవత్సరం అంత సంతృప్తికరంగా ఉండదు. ఎప్పుడూ ఏదో ఒక విధంగా చేతిలో డబ్బు ఉండడంవలన అన్ని వ్యవహారాలు ఒడుదుడుకులు లేకుండా నెరవేరుతాయి భారీ ఎత్తునచేసే వ్యాపారాల్లో పోటీవారి పోటీ వల్ల కొన్ని అవకాశాలను కోల్పోయే సూచనలు ఉన్నాయి వృత్తి ఉద్యోగాల్లో మీ పరిస్థితి సామా న్యంగా ఉంటుంది కొంచెం కార్యభారం పెరిగినా తగిన ప్రతిఫలాన్ని పొందగలరు కొంతమంది బంధువులు తమ స్వార్థంకోసం కుటుంబంలో భేదాభి ప్రాయాలు కల్గించడానికి ప్రయత్నిస్తారు విద్యా ర్థులు మొదటనుంచీ శ్రద్ధగా చదవడం మంచిది

## మే-24

మీ స్వంత వ్యవహారాల మాట ఎలా ఉన్నా ఇతరుల వ్యవహారాల్లో మీ ప్రయత్నాలు నిరాటంకంగా సాగుతాయి సంవత్సరం మధ్యలో సాహసముతో కూడిన వ్యవహారాలు కూడా లాభిస్తాయి భాగ స్వాములతో కలిసిచేసే వ్యాపారాల్లో స్వల్ప భేదాభి ప్రాయాలు రావచ్చునుగాని అందువల్ల ఏ కార్య క్రమమూ ఆగిపోదు వృత్తిరీత్యా దూర ప్రయా ణాలు చేస్తారు ఉద్యోగంలో మీ పరిస్థితి సంతృప్తి కరంగా ఉంటుంది కోర్టు వ్యవహారాల్లో కొంత మంది మిత్రుల సహాయంవలన అనుకూలత లభి స్తుంది ఆరోగ్యం బాగానేఉన్నా అప్పుడప్పుడు కొంచెం బలహీనత కన్పిస్తుంది విలాస యాత్రలు చేస్తారు. విద్యార్థులకు సెప్టెంబరు పరీక్షలు అను కూలంగా ఉంటాయి.

## మే-25

ఇతరుల దృష్టిలో ఈ సంవత్సరం మీకు యోగ వంతమైనదేకాని మీకు మాత్రం అంత సంతృప్తి కరంగా కన్పించదు ఎప్పుడూ పదిమంది మీతో తిరగడం అందరూ మీమాటకు ఓహో అనడం జరుగుతుందికాని మీకు దానివల్ల లాభించేది ఏమీ ఉండదు. వ్యాపారంలో సామాన్యమైన వ్యవహారా లకు కూడా విశేషమైన ప్రయత్నం చేయవలసి వస్తుంది రావలసిన డబ్బు సమయానికి అందక పోవడంవలన ఆర్థికంగా ఒత్తిడికి గురికాగలరు. వృత్తిలో కొత్తవారి పోటీని ఎదుర్కోవడం వలన మీ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి. ఉద్యోగంలో విశేషమైన అనుకూలతను ఆశించడానికి అవకాశంలేదు ఆరోగ్యం బాగానే ఉంటుంది. విద్యార్థులు సాధారణంగా కృతార్థులు కాగలరు.

## మే-26

గడచిన సంవత్సరం కంటే యీ సంవత్సరం బాగా ఉంటుంది వృత్తి వ్యాపారాల్లో మీరు యిదివరకు యెంత కృషిచేసినా నెరవేరని వ్యవ హారాలు యిప్పుడు సానుకూల పడతాయి ఇంత వరకు కొన్ని వ్యవహారాల చిక్కుల్లో ఉండిపోయిన డబ్బు యిప్పుడు చేతికి వస్తుంది భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలకంటే మీరు స్వంతంగా చేసే వ్యాపారాలు లాభదాయకంగా ఉంటాయి. ఉద్యోగంలో మీ అభిప్రాయాలను అమలు జరప డానికి అవకాశం లభించడం వలన మీశక్తి సామ ర్థ్యాలను రుజువు చేసికొనగలరు ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది కుటుంబ సంతోషం లభిస్తుంది. బంధువర్గంలో గౌరవం లభిస్తుంది. విద్యార్థులు మంచిమార్కులతో కృతార్థులు కావచ్చును.

## మే-27

వృత్తి వ్యాపారాల్లో అప్పుడప్పుడు ఆందో ళన కలిగించే పరిస్థితులు యేర్పడడంవలన, ఏ వ్యవహారంలోను తగినంత అభివృద్ధిని సాధించలేరు వ్యాపారంలో మీరు యిదివరకు కొన్ని వ్యవహా రాలను నిర్లక్ష్యం చేయడంవలన యిప్పుడు వ్యయ ప్రయాసలకు గురికాగల సూచనలు ఉన్నాయి. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాల్లో నష్ట వస్తుంది వృత్తిలో పోటీవారి పోటీ పెరగడం వలన మీ కార్యక్రమాలను మార్చుకోవలసి వస్తుంది. ఉద్యోగంలో స్థానచలనం కలగవచ్చును కాని మార బోయే స్థానంలోనే ముమ్ముందు ప్రయోజనం ఉంటుంది సాంఘిక వ్యవహారాల్లో నూతన గౌర వాన్ని పొందగలరు తీర్థయాత్రలు చేస్తారు. విద్యార్థులు చాలా శ్రమ మీద కృతార్థులు కాగలరు. ★



# వంకర గీతలు

డి. కామేశ్వరి

పొడుగాటి వాలుజడా జడలో కదంబమాల, కళ్లకు కాటుక, కుంకుమ బొట్టు, మెడలో నల్ల పూసలు, కంచిపట్టుచీర, అదేరంగు బ్లౌజు, సాదా చెప్పులు, పమిట బుజం నిండా కప్పుకుని తెలుగుతనం ఉట్టి పడుతున్న వేషంలో పచ్చగా, నాజూగ్గావున్న శాంతి, రావు వెన కాలే హాల్లో అడుగుపెట్టింది.

కళ్లు జిగేలుమన్నాయి. రంగురంగుల కాంతులు చిమ్ముతూ రకరకాల ఆకారాల్లో దీపాలు, నున్నగా మెరిసే ఫ్లోరింగు, చుట్టూ సోఫాలనిండా ఆధునిక దుస్తుల్లో ఆడవాళ్లు, వాళ్ల కెదురుగా నిలబడి కబుర్లు చెబుతూ మగవాళ్లు, చేతుల్లో రంగు రంగుల పానీయాలు, నవ్వులు, మాటలు అంతా అట్టహాసంగా ఉంది. మగవాళ్లంతా ఒకలాగే కనపడుతున్నారు. వైవిధ్యమంతా ఆడవారిలోనే.

చుట్టూ వో డజను జతల కళ్లు కుతూహలంగా యిటు తిరిగాయి. శాంతి బెరుకుగా చుట్టూ చూసి కొద్ది క్షణాలు తల దించుకుంది. రావు [illegible]

పెళ్లయి మూడేళ్లయినా, రావు సిక్కింలో ఉండిపోవడం మూలాన శాంతికి సైనికోద్యో[illegible] భార్యగా సాంఘిక జీవితం అనుభవంలోకి రాలేదు. రావుకి యీ ప్రాంతానికి బదిలీ అయి నె[illegible] కావస్తోంది. అది ఆమెకి మొదటి అనుభవం.

జనరల్ భగత్ గౌరవార్థం ఆ రాత్రి మెస్‌లో 'సోషల్ నైట్' ఏర్పాటు చేయబడింది. డి[illegible] డిన్నరు, ఆ తర్వాత డాన్స్. బయట రెజిమెంటల్ బాండ్ వాద్యాలు వినపడుతున్నాయి.

"నమస్తే జీ!" తెల్ల షార్క్‌స్కిన్ కోటు నల్లబౌ, నల్ల పాంటు, పచ్చగా, పొడుగ్గా ఒకతను [illegible] చేతులు జోడించాడు.

"నమస్తే!" ఉలిక్కిపడింది శాంతి

"నేను లెఫ్టినెంట్ మెహ్రా" పరిచయం చేసుకున్నాడు మెహ్రా.

"శాంతి" మొహమాటపడుతూ చెప్పింది శాంతి

"రండి" మర్యాదగా దారి చూపించి తీసుకు వెళ్లి ఒక సోఫామీద కూర్చోబెట్టాడు మెహ్రా

అంతకుముందు కూర్చున్న యిద్దరు వేరో వైపు జరిగి ఆమెకి చోటిచ్చారు

"ఏం తీసుకుంటారు ?" అడిగాడు మెహ్రా ఇంగ్లీషులో

"నాకేం వద్దండి"

"మీకు కావాలా, వద్దా అని అడగలేదు నేను!" ఆమె జవాబు వినకుండానే వెళ్లిపోయాడు మెహ్రా.

"మనం యింతకుముందు కలుసుకోలేదు నేను మిసెస్ అరోరా" కుడివైపు ఆమె తనని తాను పరిచయం చేసుకుంది

"మిమ్మల్ని కలుసుకోడం ఆనందంగా ఉంది, నేను శాంతి,"

"యీమె మిసెస్ తివారి"

"నమస్తే, చాలా సంతోషం! నాపేరు శాంతి" మిసెస్ తివారివంక తిరిగి అంది శాంతి

"ఇంక ఆపేరు మరిచిపోవాలి మీరు ఇక మీదట ఇక్కడున్నంతకాలం మీరు మిసెస్ ఎవరో ఒకరు!" నవ్వుతూ సరిదిద్దింది మిసెస్ తివారి

"క్షమించండి, మిసెస్ రావు!" సిగ్గుపడింది శాంతి అది ఆమెకి మొదటి పాఠం ఏదో పెద్ద నేరంచేసి పట్టుబడ్డ దొంగలా అదోలా అనిపించింది

"మేజర్ రావ్ క్రొత్తగా వచ్చారు గదూ!?—" మిసెస్ తివారి

"అవును, వచ్చి నెలవుతుంది"

మిసెస్ అరోరా పొట్టిగా, లావుగా, తెల్లగా ఉంది పల్చటి నైలాన్ చీర, నెరుస్తున్న వెంట్రుకల్ని చుట్టిన బర్మా ముడి, స్లీవ్‌లెస్ బ్లౌజ్, లిప్ స్టిక్, వయస్సు పెద్దదయినా, వేషం చాలా ఆధునికంగా ఉంది ఇంగ్లీషులో మాట్లాడాలన్న తాపత్రయమైతే ఉందిగాని అంతగా వచ్చినట్టు కనపడదు

మిసెస్ తివారి పొడుగు పొట్టీ కాకుండా ఉన్నా, లావాటి శరీరం, వయసుకి మించిన వేషం మిత భాషి మాట్లాడినప్పుడు కల్నల్ భార్యనన్న రీవి, అధికారం కనపరుస్తూ మాట్లాడుతుంది కప్పుకున్న షాల్, పెదాలకి రంగు, వగైరా అన్నింటిలాగే యింగ్లీషు మాటలు తరుచు వదలడం కూడ ఆమె కొక ఫ్యాషన్

మిసెస్ దారువాలా ముప్ఫైఏళ్ల మనిషి మంచి గులాబిరంగు—ఛాయ మంచి విగ్రహం వంటి రంగులో కలిసే చీర, చేతులు, వీపు లేని జాకెట్టు, చెవులు కనపడకుండా నడినెత్తిన చుట్టిన ముడి, లిప్‌స్టిక్— వయ్యారంగా ఒరిగి కూర్చుని ఎవరితోనో ఉల్లాసంగా మాట్లాడుతూంది

శాంతి బెదురుతూ చుట్టూ చూసింది

మిసెస్ రంజిత్‌సింగ్, పొడుగ్గా, లావుగా, మోటుగా, పంజాబీ దుస్తుల్లో, అదోలా కనిపించే ప్రక్క పాపిడితో, చుట్టూ ఉన్నవాళ్లంతా ఒక [illegible] తూంది

మిసెస్ థామస్ పొడుగు. ఫ్రాక్‌మీద ఫుల్ వోవరు, ఎత్తు మడమల జోళ్లు, కత్తిరించిన జుట్టు, పలుపు మీద వికారంగా కనిపించే పెదాల రంగు. తనదీదేశం కాదని అందరూ అనుకోవా లన్నట్టుంది

మిసెస్ తులాని సన్నగా, పొడుగ్గా, తెల్లగా ఉంది పల్చటి సిల్కుచీర, దానికి మేచయ్యే స్లీవ్‌లెస్ బ్లౌజు, నడినెత్తిన చుట్టిన సిగలోంచి వెండి ఫిలిగ్రీవర్కుతో చేసిన కుచ్చులు వేలాడుతున్నాయి చెవులకి పొడుగాటి జూకాలు, పొడుగాటి లాకెట్ గొలుసు, గాజులు, నగలు, చెప్పులు, హేండ్‌బాగు అన్నీ చీరకి మేచయ్యేటట్టు ఉన్నాయి కార్డిగాన్ తొడుక్కుని, మధ్య మధ్య పోగ్గా సిప్ చేస్తూ, "ఈ కాలంలోనూ ఇలాంటి వాళ్లుంటారా ?" అన్నట్లు వింతగా చూసింది శాంతి వంక.

ఇంకా ఆప్రక్క మిసెస్ దేశముఖ్— ఇంచుమించు పై మాదిరి వాళ్లలానే వేషం, ఆధునికత ఉట్టిపడుతూ

వీళ్లందరికీ అతకని మనిషి మిసెస్ మీనన్ ఒకతే మంచి కళగల మొహం, జరీలేని కంచి చీర, అదేరంగు జాకెట్టు, రింగు చుట్టిన ముడి, కుడిచేతికి బంగారు గాజులు, ఎడం చేతికి వాచి, కేప్ కప్పుకుంది

శాంతిని చెప్పలేని దిగులు ఆవహించింది

"తీసుకోండి" నల్లరంగు డ్రింక్ ఒక గ్లాసులో తెచ్చి అందించాడు మెహ్రా మొహమాటపడి, ఇబ్బందిగా చూసింది శాంతి

"అందరూ తాగుతున్నప్పుడు మీరు త్రాగక పోవడం ఆచారంగాదు, మీ కింకా క్రొత్త కొన్నాళ్లు పోతే మీకే అలవాటు అవుతయి, ఈ కట్టుబాట్లు!" మిసెస్ అరోరా చిన్నపిల్లకి చెప్తున్నట్లు నవ్వుతూ అంది

"కోకోకోలా తాగడానికి అభ్యంతరం ఏమిటండీ!" నవ్వాడు మెహ్రా శాంతి మెల్లిగా గ్లాసు అందుకుంది నలుగురిమధ్య క్రొత్తదనంతో మథనపడడంకన్నా, అలా క్రొత్తదానిలా, తెలియని దానిలా అందరిలోనూ తేలిపోడం మరింత బాధాకరంగా ఉంది

కాసేపు కబుర్లుచెప్పి వెళ్ళిపోయాడు మెహ్రా మిసెస్ అరోరా, మిసెస్ తివారి ఎవరితోనో కబుర్లలో పడ్డారు శాంతి గ్లాసు ఖాళీచేసి చుట్టూ చూసింది ఎవరిచేతుల్లోనూ గ్లాసు ఖాళీగాలేదు మిగతా అంతా తాగడం మానేసి ఉత్తినే చేతుల్లో పట్టుకుని మధ్య మధ్య కొద్దిగా గుటక వేస్తున్నట్లు ఉంది క్షణ క్షణం తప్పులు చేస్తున్నట్లనిపించింది శాంతికి మిగతా అందరి వేష భాషలకీ, తనకీ మధ్యనున్న అంతరం, తన ప్రవర్తన మూలాన మరీ ఎక్కువౌతూందన్న భయ మొకటి ఆమెని క్రొత్తగా వెంటాడసాగింది

సరిగ్గా ఎనిమిదిన్నరకి హాలునిండా కలకలం ఆగింది మగవాళ్లంతా గుమ్మం ముందు గుమిగూడారు కరచాలనం జరుగుతోంది జనరల్ దిగాడన్నమాట! బాండ్ వాద్యం ఎక్కువగా వినబడుతోంది ఆడవాళ్ల మాటల సద్దు కొద్దిసేపు ఆగింది. అందరూ అటువైపు చూడసాగారు.

పొడుగ్గా, బట్టతలతో, [illegible] ఒక మనిషి ఆడవాళ్ల మధ్యకి వచ్చాడు ప్రక్కన బ్రిగేడియర్ నిలబడి ఒక్కొక్కరినే పరిచయం చేస్తున్నాడు.

శాంతి దగ్గర నిలబడ్డాడు జనరల్ నవ్వుతూ నమస్కరించి. శాంతి సిగ్గుపడి సంభ్రమంతో నిలబడి నమస్కరించింది బ్రిగేడియరు పేరు తెలియక కొద్దిసేపు ఇబ్బందిపడి చివరకు "క్రొత్తగ వచ్చారు!" అన్నాడు

"మిసెస్ రావ్" మిసెస్ అరోరా చెప్పింది

"కూర్చోండి ఎక్కడనుంచి వచ్చారు?" అడిగాడు జనరల్ నవ్వుతూ

"రాజమండ్రి"

"రాజమండ్రి—ఎక్కడుంది? బెంగుళూర్ దగ్గిరా?" అయోమయంగా బ్రిగేడియర్ వంక చూశాడు జనరల్

"మెడ్రాసు దగ్గిర అనుకుంటాను!" తనకే తెలియదన్నట్లు చూశాడు బ్రిగేడియర్

శాంతికి తను చేసిన పొరపాటు అర్థమయింది కాని సరిదిద్దుకునేలోపునే జనరల్ ప్రక్కకి వెళ్ళిపోయాడు జనరల్ వెళ్లాక, సన్నగా మిసెస్ తివారి చెప్పింది

"మీరు తెల్సుకోవాల్సిన విషయాలు కొన్ని ఉన్నాయి. మీకు తెలియకపోయినా చుట్టూ చూసి ఉండాల్సింది జనరల్ వచ్చినప్పుడు మీరు లేవనక్కరలేదు కూర్చునే నమస్కరించాలి తర్వాత బ్రిగేడియర్ మీపేరు తెలియక ఇబ్బంది పడుతున్నప్పుడు మీ అంతట మీరే మీపేరు చెప్పుకోవాలి"

శాంతికి చెమటలు పోశాయి—ఇంకా కూర్చుంటే ఏమవుతుందో తెలియనట్టుంది కాని వెళ్లడం ఎలా?

పదకొండు కావస్తూంది అప్పటికిగాని ఎవరూ డిన్నర్‌కి వెళ్లలేదు రావు అప్పుడు కనపడ్డాడు శాంతికి కళ్లు ఏవో లోకంలో ఉన్నట్టున్నాయి. ఆమె అతన్ని ఎరిగినట్లు లేదు చేతులూ, కాళ్లూ చాల వినురుతో కదులుతున్నాయి.

"డార్లింగ్! ఎలా ఉంది?" నవ్వుతూ అడిగాడు రావు అదోలా వాసన తగిలింది శాంతికి.

డిన్నర్‌అయి బయటికి వచ్చిన మరో పావు గంటకి హాల్లో వాద్యం మొదలైంది జంటలు కదులుతున్నాయి హాలు మధ్యకి మగవాళ్లు దగ్గిరకివచ్చి అడుగుతున్నారు ఆడవాళ్లు లేస్తున్నారు శాంతి గుండెలు గబగబ కొట్టుకున్నాయి

"మీతో డాన్సుచేసే గౌరవం నాకు కలిగిస్తారా?" కల్నల్ తివారి మర్యాదగా వంగి అడిగాడు

"క్షమించండి, నావల్లగాదు!" ఎలాగో అనగలిగింది

"పర్వాలేదులెండి" కల్నల్ వెళ్ళిపోయాడు.

ఆ తర్వాత ఒకరిద్దరు ఇలానే అడిగి వెళ్ళిపోయారు డాన్స్‌కి డాన్స్‌కి మధ్య పచ్చని, తెల్లని ముదురు నల్లనిరంగులపానీయాలు తాగుతున్నారు మగవాళ్లు గంటలు గడిచినకొద్దీ నవ్వులు, కేకలు ఎక్కువ అవుతున్నాయి కాళ్లు తడబడ్తూంటే మాట అస్పష్టమవుతూంటే ప్రతి మనిషీ ఏదో వెర్రిగా మాట్లాడుతూ, బాండ్‌వాద్యానికి లయగా అడుగులు వేస్తున్నారు

రావు వచ్చి తనని డాన్సు చేయమని అడిగితే ఎంత

బాగున్నదనుకుంది శాంతి. రాళ్ళు ఎక్కడా కనబడటం లేదు. ప్రతి అయిదు నిమిషాలకీ ఎవరో వచ్చి అడగడం, ఒకోసారి కొద్దిగా బలవంతం పెట్టడం కూడా జరుగుతూంది. ఎంత కాలమని తప్పించుకోడం?

రాత్రి రెండు దాటింది. అప్పటికింక మగవాళ్ళెవరికీ రెండోమనిషి చెప్తున్నది వినబడుతున్నట్టు లేదు.

## వంకర గీతలు

"ఇంతవరకు డాన్స్ చెయ్యనేలేదు!"

తలెత్తింది శాంతి.

ఎదురుగా జనరల్ భగత్!

"నాకు డాన్స్ రాదండీ!"

"డాన్స్ రాకపోవడమేమిటో వాయిగడుగులు అటూ ఇటూ వేయడానికి! రండి, నేను నేర్పుతాను."

శాంతి ఏం మాట్లాడలేకపోయింది. జనరల్ చెయ్యి చాచాడు. బాండ్‌వాద్యం మొదలైంది. జనరల్ చేతిని పట్టుకుని ముందుకీ, వెనక్కీ, ప్రక్కలకీ అడుగువేసింది శాంతి. ఆమె మొదటిసారి ఫ్లోర్ మీదకి రాగానే చుట్టూ అంతా డాన్స్ మానేసి చప్పట్లు చరిచారు. శాంతి మొగం సిగ్గుతో కందింది.










క్షమించండి, ఇంక చాలు, నాకు అలసటగా ఉంది'' అంది శాంతి బాండ్ ఆగగానే

''మరేం పరవాలేదు—రండి'' జనరల్ ఆమెని సోఫాదాకా తీసికెళ్ళి కూర్చున్నాక, మర్యాదగా వంగి కృతజ్ఞతచెప్పి గుంపులో కలిశాడు ఆమె వెంటనే లేచి ఎవరూలేని మూలకిచేరి కూలబడింది. ఆ ప్రక్కనే మిసెస్ మీనన్ ఉంది

''ఇంకా ఎంతసేపుంటారు, వీళ్ళంతా?'' అడిగింది శాంతి

''జనరల్ ఇష్టం అతను వెళ్ళేదాకా ఎవరు కదలరు!'' నవ్వుతూ అంది మీనన్ రావు దూరంగా కనపడ్డాడు నిలబడి ఎవరో్తనో మాట్లాడుతూ సైగచేసి పిల్చింది శాంతి

''వెళ్దాం ఇంక'' అంది శాంతి నిద్రకి వాలుతున్న కళ్ళతో

''డోంట్ బి సిల్లీ!'' రావు నవ్వి వెళ్ళిపోయాడు.

శాంతికి నిద్ర ముంచుకువస్తోంది మిగతా అంతా ఎలా నిబ్బరించుకుంటున్నారో అర్థం కాలేదు మొదట్లోఉన్న బెరుకు, క్రొత్తదనంపోయి విసుగుదల హెచ్చయింది డాన్స్ తర్వాత డాన్స్, చివరకది ఏరకం డాన్సో తెలుసుకోలేనివిధంగా తయారైంది.

మూడున్నర గంటలవేళ, ''ఒకే, ఛాప్స్! థాంక్యూ, గుడ్‌నైట్!'' అని చెప్పి, ఆడవాళ్ళందరికి నమస్కరించి, కారుకేసి నడిచాడు జనరల్ జనరల్ వెనకాలే బ్రిగేడియర్, కల్నల్స్ అందరూ నడిచారు

దారిపొడుగునా, ఇంటికి వచ్చాక, శాంతి రావుతో ఏమేమో మాట్లాడాలనుకుంది ఎన్నో అడగాలనుకుంది అక్కడి కొందరి మనుషుల ప్రవర్తనని, వాళ్ళ ఆచారాలమీద, పద్ధతులమీద, తన అభిప్రాయాల్ని ఏవేవో చెప్పాలనుకుంది చర్చించాలనుకుంది కాని ఇంటికి రాగానే బట్టలైనా మార్చకుండా మంచంమీదపడి నిద్రపోయేడు రావు

*　　*　　*

మర్నాడు ఉదయం రావు తొమ్మిదిన్నరకి లేచాడు స్నానం వగైరాలు కానిచ్చి వచ్చేసరికి పదిన్నర అయింది అప్పటికి శాంతి వంట కూడ పూర్తయింది

రావుకి కాఫీ అందిస్తూ, ఏభావం వెలిబుచ్చని అతని మొహంలోకి చూసింది క్రితం రాత్రి కళ్ళలో మైకం ఆమె కళ్ళముందు కదిలింది

''మీరు తాగుతారని నాతో ఎప్పుడూ చెప్పలేదేం?''

''అదేమంత ఘనకార్యమని ప్రకటించుకోవాలి?''

''తాగక పోతేనేం?''

రావు నవ్వాడు సమాధానం చెప్పలేదు.

''రాత్రి నేనున్నాన్న సంగతే మీకు గుర్తున్నట్టు లేదు!''

''నిన్ను కనిపెట్టి చూస్తూనే ఉన్నాను నువ్వు ఎవరోతనూ మాట్లాడకుండా తలదించుకు కూర్చోడం జనరల్ వచ్చినప్పుడు నిల్చుని తడబడడం నిన్నందరూ డాన్స్‌కి పిలవడం, నీవు బిత్తర చూపులు చూడడం, చివరన జనరల్‌తో డాన్సు, ఆఖర్న అక్కడ మిసెస్ మీనన్ దగ్గరకివచ్చి, సగం నిద్దలో కూలబడ్డం—అంతా చూస్తూనే ఉన్నాను!''

శాంతి సిగ్గుపడి తలదించింది

''చూడు శాంతీ, నీకు, నాకు ఇష్టమున్నా లేకపోయినా మనం ఇక్కడికి వచ్చాం ఇప్పుడు ఇక్కడున్నప్పుడు ఇక్కడి పద్ధతులు, అలవాట్లు, కట్టుబొట్లు పాటించడం మంచిది ఎప్పుడో ఒకసారి తాగినంతమాత్రాన పోయేదేం ఉండదు కాని తాగకపోతే, నలుగుర్లోనూ వెలిగా ఉన్నట్టవుతుంది అలాగే నువ్వూ అందర్లా కాకుండా ఎవరితో మాట్లాడకుండా ఒక్కత్తెవీ కూర్చుంటే పోయేదే ముండదు గాని, సాంఘికంగా వెనకబడినట్టు చూస్తారంతా వాళ్ళకా అవకాశం ఎందుకు కలిగించాలి?''

''అయితే నేనూ డాన్స్ చేయాలంటారు?''

''ఏమిటి పోతుంది డాన్స్ చేస్తే?''

''మీరెన్ని చెప్పండి, నావల్లగాదు. అలా పరాయి మగవాణ్ని పట్టుకుని అసలీ విదేశీ పద్ధతులు, అలవాట్లు మనదేశంలో ఎందుకో ఇంకా?''

రావు మళ్ళీ నవ్వాడు, శాంతి కళ్ళలోకి చూసి ఆ నవ్వుకి శాంతికి కోపం వచ్చింది ''నువ్వు ఏం తెలియని అమాయకురాలివని'' చెపుతోన్నట్టుంది, ఆ నవ్వు

''మీరలా నవ్వితే నాకు కోపం వస్తుంది''

''నీకు కోపం వస్తే నాకు బాగుంటుంది'' ప్రేమగా నవ్వాడు రావు

మొదట కొన్ని క్షణాలు ఏం చెప్పాలో తెలియని సందిగ్ధంలో పడింది శాంతి తర్వాత ఆమె మనసులో మాట చెప్పుకోవాలన్న ఆత్రుత ఎక్కువవుతూంటే మెల్లిగా మొదలుపెట్టింది

''నిన్నరాత్రి నన్ను వాళ్ళంతా ఏదో వింత వస్తువుని చూసినట్టు చూస్తుంటే నా కెంత చిన్నతన మనిపించిందో తెలుసా ? వాళ్ళకన్న ఏదో తక్కువ అన్నట్టు చూసి మాట్లాడడం ! క్రొత్తలో తెలియక ఏదో చిన్న పొరపాట్లు చేశానే అనుకోండి అంతమాత్రాన మరీ అంత ఇదిగా మొగంమీద చిన్నబుచ్చుకునేలాగ చెప్పాలేమిటి ?''

రావు నవ్వాడు, మళ్ళీ అదే ధోరణిలో

''శాంతి డార్లింగ్ ! నిన్న నీ వేషం చూస్తే నాకేమనిపించిందో చెప్పనా ? కోపం తెచ్చుకోకూడదు సుమా !''

''చెప్పండి, ఫరవాలేదు''

''పందొమ్మిదో శతాబ్దపు ఆదర్శ భారత నారీ మణి అని బిళ్ళ ఒకటి మెళ్ళో వేలాడేసి మ్యూజియంలో పెట్టాలనిపించింది''

''మీకు అలా అనిపించి ఎందుకు చెప్పలేదు ?''

''నేను చెపితేకన్నా, నలుగుర్లోనూ చూస్తే నీకే తెలుస్తుందని వూరుకున్నాను !''

శాంతి చాలసేపు మాటాడలేదు

''శాంతీ ! నువ్వు తెలివైనదానివి చదువు, అందం, జ్ఞానం వివేకం అన్నీ ఉన్నాయి. నిన్ను చూస్తే నా కెంత గర్వంగా ఉంటుందో తెలుసా . అయినా నువ్వు కొంచెం మారాలి శాంతి రోమ్‌లో ఉన్నప్పుడు రోమన్‌లాగ ఉండమని ఒక సామెత ఉంది అలాగ యిక్కడున్నప్పుడు ఇక్కడివాళ్ళలాగ ఉండడం అవసరం. వాలుజడలు, జడకుచ్చులు మానేసి ఇప్పటి ఫేషన్ ప్రకారం ముడులు చుట్టుకోడం, ఎప్పుడూ కంచి జరీ పట్టుచీరలే కాకుండా నాజూకువి కట్టడం మొదలైనవన్నీ పెద్ద విషయాలేం కావు ! నీ కిష్టమైతే మారడం నీ చేతిలో పని ఇదివరకు నేను ఒకటి రెండుసార్లు చూచాయగా అన్నా నీవు పట్టించుకోలేదు అలా మారితే నలుగుర్లోనూ కలసి మెలసి ఉండడం సులభమైనప్పుడు అలా ఎందు కుండకూడదు ? పోయేదేముంది ఇంతలో ఇక్కడింకోటి గుర్తుంచుకో. అందరితో కలసి మెలసి ఉండడంవల్ల నీ గౌరవం హెచ్చడమే కాకుండా, సాంఘికంగా నా స్థాయి కూడ హెచ్చవుతుంది మిగతా చోట్లలా కాదు ఇక్కడ. మిగతా ఉద్యోగాలలా కాదు ఆర్మీ ఆఫీసరు ఉద్యోగం. ఆడా, మగా అంతా చనువుగా కలసి ఉండేచోట, నీవు వెలిపడినట్లు ఉంటే, నీతోపాటు నేనూ వెలిగా ఉండిపోతాను ! ఒకరకంగా చూస్తే నలుగుర్లోనూ నా పరపతి, గౌరవం నీమీద ఆధార పడుంటాయి !''

''అయితే స్లీవ్‌లెస్ బ్లౌజు, లిప్‌స్టిక్‌లు, నైలానులు వాడకపోతే అనాగరికులు క్రిందే లెక్క ?''

'' అదికాదు శాంతి, లోకంతోపాటే మనమూ, రోజులు మారుతున్నాయి ఎప్పటి కాలానికి తగ్గట్టు అందరిలా ఉంటే తప్పేముంది ''

''అయితే రేపట్నుంచి స్లీవ్‌లెస్ బ్లౌజులు, లిప్‌స్టిక్, షిఫాన్ చీరలు, క్రొత్తరకం హెయిర్ స్టయిల్సు మొదలుపెడతా నుండండి. డాన్సు పాఠాలు కూడ నేర్చుకోమంటారా ?''

''డాన్స్ అంటే నీ కిష్టంలేదని తెలుసు ! కాని



# వంకరగీతలు

అందులో తప్పేం కనపడదు నాకు! ఇదంతా పెద్ద కుటుంబం. ఇక్కడున్న ఆఫీసర్లు అందరూ నీకు సోదరుల్లాంటివారు మనసులో ఆ భావం ఉన్నప్పుడు, పరాయి మగవాణ్ణి తాకామన్న ఆలోచన రాదు పవిత్రత అన్నది మనసులో ఉం ంది నిన్న జనరల్‌తో డాన్స్ చేశావు నీకేమనిపించింది? అతనికి నీ తండ్రి అంత వయసు ఉంటుంది అతను నీ చేతిని పట్టుకుని కాసేపు అటూ యిటూ తిరిగితే యిందులో అపచారం, అవినీతి ఏముంటుంది చెప్పు?"

" నేనేదో తేలిగ్గా మాట్లాడితే, మీ రెండు కంత సీరియస్‌గా ఉపన్యాసాలు దంచుతున్నారు." చిలిపిగా అతని జుట్టు రేపింది శాంతి

* * *

"క్లబ్బులో యివాళ రాత్రి పిక్చరున్నట్టు చెప్పలేదేం? నిన్న సర్క్యులర్ వచ్చిందటగా?" మధ్యాహ్నం భోజనం చేస్తూ అడిగాడు రావు. ఆఫీసులో మీనన్ మాటల సందర్భంలో 'పిక్చర్‌కి వస్తున్నారా?' అని అడిగేవరకు రావుకి తెలియదు

"ఎలాగు వెళ్లడం అవదని చెప్పలేదు"

"ఏం! ఎందుకు అవదు? రాత్రి భోజనంచేసి ఏడు గంటలకి వెడితే పదిలోపల వచ్చేస్తాం, ఇందులో వీలవక పోవడానికి ఏముంది?"

"బాబుకి తొమ్మిది గంటలకి ఫీడింగ్ టైము, సుజాకి అన్నం అది ఎవరు పెడతారు?"

"ఒక్కపూటకి మరేం కొంప మునగదులెద్దూ, ఆయా, రాము ఉన్నారుగా! సుజాకి అన్నంపెట్టి వెడదాం, ఆయా బాబుకి పాలు పడుతుంది, మంచి పిక్చర్!"

* * *

"తొందరగా కానియ్యి, టైమయింది!" టై కట్టుకుంటూ కేకవేశాడు రావు

"అయిపోయింది!" అంటూ వచ్చిన శాంతిని చూసి నుదురు చిట్లించాడు రావు

"మళ్లీ అదే వేషం! ఎప్పుడూ ఆ పట్టుచీరలే కాకపోతే మొన్న కొన్న షిఫాన్‌చీర కట్టుకోకూడదూ? ఆ నల్లపూసలు, మట్టెలు ఒక్కపూటకి తీసేస్తే మరేం పాతివ్రత్యానికి భంగం రాదులే! శోభనం పెళ్లికూతుర్లా అన్నిపూలేమిటి? ముడి చుట్టుకోకూడదూ!" శాంతిని ఆపాదమస్తకం పరీక్షిస్తూ అన్నాడు రావు

శాంతి ఇబ్బందిగా మొహంపెట్టి "ఏమిటో నాకు వాలుజడే కంఫర్టబుల్‌గా ఉంటుంది. ఆ ముడి నాకు సరిగా కుదరదు ఇప్పుడు మొదలు పెడ్తే ఓ అరగంట పడ్తుంది ఈసారికి ఇలా రానిద్దురూ!" చూపులు తప్పిస్తూ అంది.

మౌనంగా స్కూటర్ స్టార్ట్ చేశాడు రావు

"ఆయా, బాబుకి సరిగా తొమ్మిది గంటలకి పాలుపట్టు ఫ్లాస్కులో పోశాను సుజాని ఏడిపించకుండా పడుకోబెట్టు రాముా!"

"ఏమిటి ఓ రెండుగంటలకి అన్ని అప్పగింతలు పెడుతున్నావు? ఏది నీ కార్డిగాన్ తెచ్చుకోలేదా?"

"పర్వాలేదు లెద్దురూ, ఇవాళ అట్టే చలిగా లేదు మళ్లీ లోపలికి వెడితే ఆలస్యం" రావు కింకేం చెప్పాలో, ఎలా చెప్పాలో తెలియలేదు.

* * *

ట్యూబ్‌లైట్ల కాంతిలో క్లబ్బంతా వెలిగి పోతూంది రకరకాల మనుష్యులు, రకరకాల ఫాషన్లు కొందరు అటూ యిటూ తిరుగుతూ పరిచితుల్ని పరామర్శిస్తున్నారు కొందరు నిల్చుని మాట్లాడుతున్నారు కొందరు అక్కడ వేసిన కుర్చీల్లో కూర్చుని మాగ్‌జైన్లు తిరగేస్తున్నారు. పిక్చరు ఇంకా ఆరంభించలేదు అది అక్కడ పనిచేసే ఆఫీసర్లకోసం ప్రత్యేకించిన క్లబ్బు. ఓపెన్ ఎయిర్ థియేటర్లో వారానికి ఒకసారి సినిమా ఉంటుంది రోజూ పేకాట, బిలియర్డ్స్, టెన్నిస్. ఆటలతోబాటు అప్పుడప్పుడు డాన్సులూ డిన్నర్లూ కూడ జరుగుతుంటాయి

రావుని, శాంతిని గమనించి కూడ ఎవరూ పట్టించుకోలేదు ఆరోజు మెస్‌లో పరిచయం అయినవారే కాకుండా యింకా చాలామంది ఉన్నారు. ఆడవాళ్ల నవ్వులతో క్లబ్బు ఎగిరిపోతూంది క్రితం సారి కంటె యింకా ఎక్కువ ఆడంబరంగా తయారయారు అందరూ, ఒక్కొక్కరు ఒక్కొక్క ఫాషన్‌కి నమూనా అన్నట్టు

రావు మొహంచూసి, అతని భావం అర్థం చేసుకుని ఆడవారి గుంపులోకి నడిచింది శాంతి. అంతవరకూ పెద్దగా నవ్వుతూ కబుర్లు చెప్పుకుంటున్న వాళ్లంతా ఒక్కసారి మౌనం వహించారు

"ఇవాళ ఎంత సుదినం? మీరు క్లబ్బుకి వచ్చారు!" మిసెస్ తులాని అడిగింది, కొంత సేపటికి, హాస్యం, హేళన మిలాయించి అంతా ముసిముసిగా నవ్వి కళ్లతో మాట్లాడుకుంటున్నారు.

"రోజూ సాయంకాలం ఏం చేస్తారు? సాయంకాలం ఓ గంట క్లబ్బుకి రాకూడదూ?" మిసెస్ తివారి అడిగింది

"వీలునిబట్టి చూస్తాను" వాళ్ల అహంకారాన్ని సహించలేక అదోలా అంది శాంతి.

సినిమా మొదలైంది లైట్లారిపోయాయి.

"చూశావా, యివాళ కూడ ఎవరూ నీతో సరిగా మాట్లాడలేదు నీ ధోరణి మారేవరకు మనని అందరూ యిలాగే ట్రీట్ చేస్తారు!" క్రోధంతో అన్నాడు రావు

శాంతి మనసులో చెప్పలేని ఆందోళన చెలరేగింది బలమైన శక్తులేవో తనకి ఇష్టంలేని దారి వెంట పొమ్మని తనని తోస్తున్నట్టయింది.

* * *

"అరే, . . యిది కలా, మాయా? నన్ననుగ్రహించి దిగివచ్చిన అప్సరసా?" స్లీవ్‌లెస్ బ్లౌజ్, షిఫాన్ శారీ, చెవులు కప్పుతూ నడినెత్తిన చుట్టిన సిగ, లిప్‌స్టిక్, నాజూకు స్లిప్పర్లు, నవనాగరికంగా కనపడిన శాంతిని చూడగానే ఆశ్చర్యపోయేడు రావు

"ఏం, తృప్తి అయిందా మీకు? ఇంకా ఏమయినా మిగిలాయా?" కొంచెం నిష్ఠూరంగా అన్న శాంతి భుజం తడుతూ,

"కోపమా శాంతీ! ఎంత బాగున్నావో తెలుసా యిలా? వాళ్లందరికంటె నీకు యీ స్టయిలు చాల బాగా అమరింది గుడ్ గర్ల్! యులుక్ వెరీ స్మార్ట్! ఇలా చెప్పినట్టు వింటే నా కెంత బాగుంటుందో తెలుసా?" మురిపెంగా చూస్తూ దగ్గరికు తీసుకున్నాడు

"పదండి, క్లబ్బుకి వెడదాం" కాఫీ ఇచ్చాక అంది

గ్రహమా ? హాస్యమా, కోపమా ?"

"ఎందుకంత ఆశ్చర్యపోతారు ? ఇకమీదట మీ యిష్టం వచ్చినట్టే ఉండదల్చుకున్నాను శాంతి, మిసెస్ రావుగా క్రొత్తరూపం దాల్చ దల్చుకుంది అంతే! ఇవాళ మిసెస్ తులాని దగ్గరకి వెళ్లి క్రొత్తరకం హెయిర్ స్టయిల్సు నాలుగయిదు నేర్చుకు వచ్చాను. ఆమె డాన్సు కూడ నేర్పుతానంది. ఇక మీదట నాతో రావడం మీకు తలవంపుగా ఉండదు!"

"తలవంపు అని నే నెప్పుడయినా అన్నానా? నన్నెందుకు అర్థం చేసుకోవు? అందరికంటె చదువు, అందం అన్ని ఎక్కువే అయినా అందరి ముందు తీసికట్టుగా ఉండడం ఎందుకన్నాను! అంతేగా?" అనునయంగా అన్నాడు రావు ఆమెని శాంతపరచాలని

"సర్లెండి, మిమ్మల్ని నేనేమి అనడంలేదు, వూరికే అన్నాను వెళ్దామా, మరి!" క్లబ్బులో అందరూ శాంతిని పరీక్షగా చూశారు ఒకరి మొహాలు ఒకరు చూసుకున్నారు ఆనాడు అందరి కళ్ళూ ఆమెమీదనే ఉన్నాయి.

* * *

"ఇవాళ మిసెస్ దారువాలా ఫోన్ చేసింది నాలుగు గంటలకి 'లేడీస్ పార్టీ' ఉంది రమ్మని. వెళ్లనా?" మధ్యాహ్నం డైనింగ్ టేబిల్ దగ్గర అడిగింది శాంతి

ఎన్నడూ పార్టీలకి వాటికి ఎన్నోమార్లు అడిగితేనేగాని రాని శాంతి తనంతట తానుగా అడగడం ఆనందం ఆశ్చర్యం కలిగించింది

"తప్పకుండా వెళ్లు ఇందులో అడిగి వెళ్లేందుకు ఏముంది శాంతీ! పిల్లల గొడవ నేను చూసుకుంటానులే!"

"తొందరగావచ్చి, వచ్చాక చేస్తాను వంట"

"చూడు తిండీ అన్నది పెద్ద ఆలోచించాల్సిన విషయంగాదు నువ్వక్కడనించి వచ్చాక వంట చేయక్కరలేదు! ఏ క్యాంటీన్‌లోనో కానిచ్చేద్దాం ఇవాల్టికి!"

అర్థం చేసుకున్నట్టు నవ్వింది శాంతి

* * *

"ఏం ఇంకా రావడంలేదా మీరు? ఏం చేస్తున్నారు ఇంతసేపు?" మామూలు వేళదాటిపోయాక ఆఫీసుకి ఫోను చేసింది శాంతి.

"సారీ డియర్, ఇప్పుడిప్పుడే రావడానికి వీలవదు, ఏం?"

"మీరు వస్తే క్లబ్బుకి వెడదామని రెడీ అయి కూర్చున్నాను"

"వెరీసారీ, నా కివాళ వీలవదు. రేపు వెడదాంలే" ఫోను పెట్టేయబోయాడు

"మిసెస్ మీనన్ ఇక్కడికి వచ్చింది రమ్మంటూంది ఆవిడతో వెళ్లనా?"

"వెళ్తావా? సరే వెళ్లు"

"తొందరగా వచ్చేస్తాన్లెండి బై బై"

* * *

"అబ్బ ఇంతసేపు చేశావేమిటి? బాబు ఎందుకో ఏడ్చి ఏడ్చి ఇప్పుడే నిద్రపోయాడు సుజా ఆకలి అని ఏడుస్తూంది" ఎనిమిది గంటలకి తిరిగి వచ్చిన శాంతిని చూసి కొంచెం చికాకు పడ్డాడు రావు.

"ఏం ఎందుకు ఏడ్చాడు బాబు? పాలుపట్టి వెళ్లానే ఆ ఆయా ఏం చేస్తూంది? ఆకలి అంటే అన్నం పెట్టకపోయారా? వండి వెళ్లాను!"

"ఇంతసేపూ అక్కడ కూర్చోడ మెందుకు?" ఆఫీసుతో పని భారం రావుమీద పని చేసింది

"కార్డ్సులో కూర్చుంటే టైం తెలియలేదు. అందులో రమ్మీ! మొదట అయిదు రూపాయలు పోగానే కసి ఎక్కువైంది దాంతో ఇంకో పది రూపాయలు పోయాయి అందులో సగమైనా రాబట్టాలని కూర్చుంటే ఈవేళ అయింది!"

"సరే, ఏదో ఒకటయింది! ఇకనైన త్వరగా కానియ్యి"

"నిన్న పర్సులో మూటయాభై ఉండాలి ఇప్పుడు ఏభయ్యే ఉన్నాయి నీవేమైనా ఖర్చు చేశావా శాంతీ?" పర్సు చూసుకుంటూ అడిగాడు రావు

డ్రస్సింగ్ టేబిల్ దగ్గర కూర్చుని కనుబొమలు పెన్సిలుతో దిద్దుకుంటున్న శాంతి నిర్లిప్తంగా, "నిన్న బాటాషాపులో షూస్ వచ్చాయంటే మిసెస్ దారువాలతోబాటు నేనూ తీసుకున్నాను. దానికో ఇరవై టెయిలర్‌కో ఇరవై మొన్న మిసెస్ తులాని కొన్నలాంటి చీర ఒకటి నలభై రూపాయలకి తీసుకున్నాను ఎల్లుండి పార్టీకి ఎడ్వాన్సు నో ఇరవై ఇవ్వాల్సి వచ్చింది!"

రావు నుదురు చిట్లించాడు "టైలర్‌కి ఇరవై ఏమిటి? ఏం కుట్టించావు?"

> హోటల్ సర్వరుతో : ఏం టోయి బాగ్గు లాగుం దే మి టి పళ్లెములో?
>
> సర్వరు : డబుల్ రోస్టు పెసరట్టు సార్!
>
> నల్లజర్ల అనంతకుమార్ (కాకినాడ)

"వీపుమీద రకరకాల డిజైన్లు కత్తిరించి స్లీవ్‌లెస్ బ్లౌజులు కుట్టడానికి ఎవరో ఎక్స్‌పర్ట్ టైలర్ ఉన్నాడంటే ఒక నాలుగు కుట్టమని ఇచ్చాను!"

"మిషన్‌ఉందిగా, నువ్వు కుట్టుకోలేకపోయావా?"

"నా కా ఫాషన్లు తెలియవు, అదీకాక తీరుబడిలేదు"

ఇదివరకు ఇంట్లో పిల్లలవి, తనవి అన్నీ స్వయంగా కుట్టుకుని ఒక్క పైసాఐనా దూబరా కాకూడదనే శాంతేనా అని అయోమయంగా చూశాడు రావు

"ఎల్లుండి పార్టీ ఏమిటి?"

"మేమంతా వారానికి ఒకరింట్లో పార్టీ ఇచ్చుకోవాలని నిర్ణయించుకున్నాం ఎల్లుండి నా వంతు ఫక్తు ఆడవాళ్ల పార్టీ మీరా రోజు దయచేసి బయటికి ఎక్కడికైన వెంచేయమని ప్రార్థన" నవ్వింది శాంతి

"రేపు ఇన్సూరెన్సు ప్రీమియం కట్టాలని ఉంచాను అది కాస్త నీ ఫాషన్లకి, సరదాలకి ఖర్చుపెట్టేశా వన్నమాట!" అదోలా అన్నాడు రావు

"నాకేం తెలుసు, పొరపాటయింది క్షమించండి" చిన్నపుచ్చుకుని అంది శాంతి

"సర్లె తప్పు నాది!"

* * *

వారం రోజులు ఏదో పనిమీద ఢిల్లీ వెళ్లాడు రావు. ఆరోజే తిరిగి వచ్చాడు రావు. వచ్చేసరికి రాత్రి ఏడయింది ఇంట్లో అడుగు పెట్టేసరికి సుజాత ఒక్కర్తే కనిపించింది మంచంమీద కూర్చుని ఆడుకుంటూ ప్రక్కలు అన్నీ రేగి ఉన్నాయి ఇంటినిండా బొమ్మలు, పుస్తకాలు, బట్టలు అన్నీ పడిఉన్నాయి ఏవి ఉండాల్సిన స్థానంలోలేవు కాసేపటికి ఆయా తిరిగివచ్చింది బాబు నెత్తుకుని.

"మేమ్ సాబ్ క్లబ్బుకి వెళ్లారు! నేను బాబు ఏడుస్తూంటే అలా ఆడించడానికి తీసుకువెళ్లాను రాము బజారుకి వెళ్లాడు అమ్మాయిగారు అంతా చిందర వందర చేశారు!" 'ఇల్లంతా ఇలా ఉందేమిటి? సుజాని ఒక్కగ్తేగే వదిలి అంతా ఏమయ్యారు' అని కేకలు వేసిన రావుకి భయపడుతూ పరిస్థితి వివరించింది

తిన్నగా క్లబ్బుకి బయలుదేరాడు రావు

అడుగు పెట్టగానే శాంతి కనిపించింది డాన్సు ఫ్లోర్‌మీద జంటలమధ్య అతనెవరో రావుకీ తెలియదు ఫాక్స్ ట్రాట్ వాద్యానికి లయగా అడుగులు వేస్తున్న శాంతి నేర్పుకి ఆశ్చర్యపోయాడు రావు ఫాక్స్‌ట్రాట్ ఆగింది వాల్ట్జ మొదలైంది మళ్లీ అతనితోనే ఎంత సులభంగానూ వాల్ట్జ చేసింది శాంతి

రావు దగ్గర్లో, ఒక పెం కుర్చీలో కూలబడి బేరర్ని "ఏక్ బడా బి కె" తెమ్మని ఆజ్ఞాపించాడు

డాన్సు కొద్ది నిమిషాల విరామంకోసం ఆగింది మెడని పమిట చెంగుతో తుడుచుకుంటూ విజానంగా నవ్వుతూ అతనితో టేబిల్ దగ్గరకి నడుస్తున్న శాంతి రావుని చూసింది అప్పటికే రావు బ్లాక్ నైట్ విస్కీ నాలుగు పెగ్గుల రుచి చూశాడు

"ఎప్పుడు వచ్చారు?" సంభ్రమంగా అడిగింది శాంతి ఎదురుగా కూర్చుంటూ

రావు మాట్లాడలేదు చేతిలో గ్లాసుని గుండ్రంగా తిప్పాడు శాంతికి సగం అర్థమయినట్టయింది ఆ మౌనం

"రండి ఇంటికి వెడదాం" శాంతి లేచింది

రావు ఆఖరి గుటక మింగి గ్లాసు బలంగా టేబిల్‌మీద పెట్టి లేచాడు రావు వెనకాల స్కూటర్ మీద కూర్చుని అతని భుజాలు రెండూ గట్టిగా పట్టుకుని తలని అతని వీపు కానించింది శాంతి అతను పోతున్న వేగంలో, ఆ మౌనంలో అతని మనసులోని భావాలు ఎన్నో వ్యక్తమవుతున్నాయి.

కళ్లు చెదిరే ఆవేశంలో ఎటూ చూడలేక కళ్లు మూసుకుంది శాంతి ఏదో ఆవేదన రేగింది కళ్లెదుట రంగు రంగుల గీతలు ఎలువుగా, వంకరగా అడ్డదిడ్డంగా, మెరుపుల్లా మెరిసి మాయమౌతున్నాయి తను ఆ గీతల్లో బందీగా అనిపించింది

తను గీత దాటిందా? వాటన్నింట్లో ఏది తను దాటగూడని గీత? అంతా చెల్లా చెదురుగా ఉంది.

"అబ్బ ఏమిటా విసురు? తగ్గించండి" గట్టిగా అరచింది శాంతి, వాలు గాలిలో అతనికి వినపడదన్న భయంతో

"అంత భయమెందుకు? ఇంత వేగంతోపోవడం ఇదీ ఫాషనే!" పొడిగా అన్నాడు రావు

శాంతి కళ్లు మూసుకుని అతన్ని గట్టిగా పట్టుకుంది ఆమె కళ్లముందు ఎన్నో గీతలు మెరిశాయి వంకర టింకరగా, మెరుపుల్లా! ★



లండన్‌లో ఒక దృశ్యం

# ఇంగ్లండ్‌లో నా అనుభవాలు

జంధ్యాల రుక్మిణీరామకృష్ణ

నాకు ఇంగ్లండ్‌కు వెళ్లే అవకాశం వచ్చిందని తెలిసిన క్షణం నాకు కలిగిన ఆనందం ఇంతని చెప్పలేను ఇండియా అంతటికీ కలిపి ఒకే ఒక స్కాలర్‌షిప్ ఇస్తారని, అది మా శ్రీవారికి వచ్చిందని తెలిసినపుడు చెప్పలేని ఆనందం కలిగిందని చెప్పటంలో ఆశ్చర్యమేముంది? లండన్‌లోని రాయల్ కమిషన్‌వాళ్లు ఇచ్చే ఈ స్కాలర్‌షిప్‌కు మినిస్ట్రీ ఆఫ్ ఎడ్యుకేషన్, గవర్నమెంటు ఆఫ్ ఇండియా వాళ్ళు తగిన అభ్యర్థులను ఎన్నికచేసి సిఫార్సు చేస్తారు అలా సిఫార్సు చేయబడిన అభ్యర్థులలోనుండి ఒక అభ్యర్థిని లండన్‌లో ఎన్నికచేసి స్కాలర్‌షిప్ ఇస్తారు స్కాలర్‌షిప్ వచ్చిందనే ఆనందపుటావేశం తగ్గకముందే ఇండియా గవర్నమెంటువారినుంచి, ఒంటరిగ వెళ్ళాలి, భార్యను తీసికు వెళ్ళటానికి వీలులేదని తెలియబరచటమయినది కారణం ఏమిటంటే మా శ్రీవారికి వచ్చే స్కాలర్‌షిప్ ఇద్దరికీ చాలదట! ఇప్పుడు మేము డబ్బుకు ఎంత ఇబ్బంది పడుతున్నా మాకు అన్ని వసతులు, క్రొత్త క్రొత్త సామానులే కాక స్వంత కారు గూడా కొనుక్కొన్నాం

ఇక నేను ఇక్కడికి ఎలా రాగలిగానంటే దానికి మా శ్రీవారి ఓర్పు, పట్టుదల కారణమని గర్వంగా చెప్పగలను. సుమారు అయిదు నెలలపైగా ఇండియా గవర్నమెంటుతో ఉత్తర ప్రత్యుత్తరములు జరిపి లండన్‌లో భారత ప్రభుత్వ రాయబార కార్యాలయం వారిచేత సిఫార్సు చేయించి (ఇద్దరికీ డబ్బు చాలదని గవర్నమెంటువారికి ఎవరు చెప్పారో తెలియదు— ఎందుకంటే లండన్‌లోని భారత ప్రభుత్వ రాయబార కార్యాలయంవారు మావారి తరఫునే మద్దతు ఇచ్చారు. మన ప్రభుత్వాన్ని విమర్శించటం నా ఉద్దేశ్యంకాదు ఎందుకంటే ఇక్కడ చోటు చాలదు కనక — అంతేకాక ఎన్నని విమర్శించగలం) పెద్ద భగీరథ ప్రయత్నం చేసిన తర్వాత నేను ఇక్కడకువచ్చి మా వారిని కలుసుకున్నాను అంటే మా శ్రీవారు ఒంటరిగా ఇచ్చటికి రాక తప్పలేదు అందుకు భారత ప్రభుత్వాన్ని అభినందించాలి. స్కాలర్‌షిప్ ఇచ్చే రాయల్ కమీషన్‌కు, ఆతిథ్యమిచ్చే ఇంగ్లండు ప్రభుత్వానికి లేని అభ్యంతరం మన ప్రభుత్వంవారికే కలిగింది (అందుకు మా శ్రీవారి లాబరేటరీ వాళ్ళంతా నవ్వారు) సరే, ఎలాగైతేనేం ఇక్కడకు రాగలిగాను.

లండన్‌లో దిగంగానే నాకు కలిగిన అభిప్రాయం అంటూ చెప్పటం కష్టం. విమానం దిగంగానే విమానాశ్రయంలో టావుమీద గాలిలో జుట్టు ఎగిరిపోతూ చిన్న పిల్లల్లా నన్నుచూసి సంతోషంతో [illegible] ఆయనతోట రిసెర్చిస్కాలర్ హెచ్ డి డబ్ల్యు హిల్, ఆయన భార్య కనిపించరు వాళ్లెవరో అప్పుడు తెలియకపోయినా మావారి స్నేహితులని పోల్చుకోగలిగాను నాకోసం వారంతా కారులో రావటం చేత నేను లండన్ చూడకుండా సూటిగా ఆక్స్‌ఫర్డ్ వెళ్లాను అసలు ఇంగ్లండుకు వెళ్లే అవకాశం నాకు వస్తుందా లేదా అనే సందిగ్ధంలో పడి, ఎలాగో ఇక్కడకు చేరాక మా శ్రీవారిని చూసిన సంబరంలో చుట్టుప్రక్కల పరిసరాలను పట్టించుకోలేదు కాని మావారు మాత్రం ఆయన డైరీలో తన అనుభవాలు వ్రాసుకొన్నారు అది ఇక్కడ రాయటం బాగుంటుందని వ్రాస్తున్నాను

"లండన్ విమానాశ్రయం నేను త్రోవలో చూసిన విమానాశ్రయాలన్నిటికన్నా పెద్దది మమ్మల్ని విమానాశ్రయం తాలూకు బస్సు లండన్ విక్టోరియాగా బస్సు స్టాపువద్ద దింపింది బస్సులో వెళ్తూ చుట్టు ప్రక్కల వీధులను చూస్తూ ఉంటే ఏమి ఆనందోత్సాహాలు కలుగలేదు పైగా ఏమిటీ పురాతనమైన ఇళ్లు, వాకిళ్లు అనిపించింది అన్ని యిళ్ళు బయటనుండి చూడటానికి ఒక్కలాఉండి కాసేపు చూశాక విసుగుపుట్టి బస్సులో నిద్రపో బుద్ధిపేసింది ఇండియాలో పెద్ద పెద్ద నగరాలు చూసిన తర్వాత లండన్ రోడ్లమీద వెళ్తుంటె ఏమంత వింత అనిపించలేదు ఇది మొదటి అభిప్రాయం" అదీ ఆయన అభిప్రాయం ఇప్పుడిప్పుడు నాకూ అలాగే అనిపిస్తోంది. లండన్ ఆక్స్‌ఫర్డ్ మొదలగు ముఖ్యమగు పట్టణాలలోనే కాక పల్లెటూళ్లుగూడా ఒకే మాదిరిగా ఉంటాయి ఇళ్ళు, రోడ్లునూ పెద్ద చిన్న తేడా తప్పితే అంతా ఒకటే ఈ పాత చింతకాయ మనస్తత్వం ఇక్కడ బాగా కనిపిస్తుంది ఈ కట్టడం ఇంత పాతదంటే ఆ కట్టడం అంతకన్నా పాతది అని చెప్పుకోవటం వీళ్ళకి గొప్ప ఈమధ్య కట్టినవి గూడా పన్నెండవ శతాబ్దం, పదిహేనవ శతాబ్దం కట్టడాలనమూనాలు చూడవచ్చు. ఆ పురాతన కట్టడాల మీద వీళ్ళకున్న మక్కువ ఎంత అంటే ప్రతి సంవత్సరం లెక్క లేనంత డబ్బు ఖర్చుపెట్టి వాటిని




జాగర్తగా బాగు చేస్తూ ఉంటారు మేము ఇక్కడ కొన్ని కాలేజీలు చూశాము అవి లోపల ఎంతో పాతగా కనిపిస్తాయి ఇక్కడ ఆక్స్‌ఫర్డ్‌లో పదవ శతాబ్దంనుంచీ కట్టిన కాలేజీలు, భవనాలు చూశాము. అయితే పెద్ద పెద్ద షాపులు, భవనాలు అనేకం ఆధునికంగా కట్టబడి ఉన్నాయని చెప్పక తప్పదు. వీళ్ళనుచూస్తే పాతొక వింత, అంతకంటె వీళ్ళ యీ మోజు ఇంకా పెద్ద వింత అనిపిస్తుంది

ఈ వ్యాసంలో నేను ముఖ్యంగా మనం కుతూహలంగా తెలిసికొందామనుకొనే స్త్రీస్థానం వ్రాద్దామనుకొంటున్నాను

మనదేశంలో స్త్రీలు పాశ్చాత్య స్త్రీలు ఎక్కువ స్వేచ్ఛగా, సుఖంగా ఉన్నారని వూహించుకొంటూ ఉండటం సహజం స్వేచ్ఛ మాట నిజమేకాని మన స్త్రీలకన్న ఎక్కువ సుఖమైన జీవితం వీళ్లు గడపటంలేదనిపిస్తుంది ముఖ్యంగా ఇక్కడ స్త్రీస్థానం అనుకోవలసినంత గొప్పగా లేదనుకొంటాను నేను ఇల్లూ వాకిలీ లేకుండా ఉద్యోగం చేస్తూ బ్రతకటమే గొప్ప అనుకునేవాళ్లు చాల తక్కువ సాధారణంగా పసిపిల్లలు వున్నవాళ్ళు ఉద్యోగం చెయ్యరు పెళ్ళికాని పిల్లలు, నడి వయస్కులు ఇంకా వృద్ధ స్త్రీలు ఉద్యోగాలు చేస్తారు. (ఇంత ముసలి వయస్సులో ఉద్యోగ మేమిటని మనకు ఆశ్చర్యమనిపిస్తుంది వారి ఉద్దేశ్య మేమిటంటే, స్వతంత్రంగా జీవించాలన్న తాపత్రయం ఎంత పెద్దవారయినా పిల్లల దగ్గర ఉండరు. అత్తా కోడళ్లు సరిపడకుండా ఒకేయింట్లో ఉండటంకంటే ఈ పద్ధతే మంచిదంటారు వీళ్లు) ముసలి తలితండ్రులని చూడటానికి పిల్లలు వెడుతూ ఉంటారు సెలవు రోజులలో

ఎక్కువ మంది స్త్రీలు స్కూలు చదువు ముగియగానే చదువు మానేస్తారు ఈ లోపు తనకు నచ్చిన బాయ్ ఫ్రెండ్‌తో పెళ్ళి నిశ్చయం చేసికొని పెద్దవారి అనుమతితో వివాహం చేసికొంటారు. నచ్చిన వారిని నిశ్చయించుకోవటమన్నది పిల్లల బాధ్యతే సాధారణంగా ఎంతో తేడా ఉంటే తప్ప (డబ్బు, హోదా మొదలైన విషయాలు) పెద్దవాళ్లు వారి వివాహమును కాదనరు సాధారణంగా భార్యా భర్తల వయస్సులో పెద్ద తేడా కనిపించదు

ఇక్కడ స్త్రీవిద్య చాల తక్కువ స్థాయిలో ఉన్నదనే చెప్పాలి 5—15 సంవత్సరములవరకూ బాల బాలికలకు నిర్బంధ ఉచిత విద్య కాలేజీల్లోగాని, యూనివార్శిటీల్లోగాని ఆడవాళ్లు చాల అరుదు. ఇక్కడ లేడీ డాక్టర్లు ఎంత తక్కువో చూస్తే ఆశ్చర్యమేస్తుంది. ఇదంతా చూస్తే

ఇక్కడ స్త్రీ గృహసీమదాటి సాధించిన దేమిటని పిస్తుంది. (ఇక్కడ నాకు తెలిసిన భారత స్త్రీ లందరూ (గ్రాడ్యుయేట్ తక్కువవాళ్లు లేరు) పెద్ద హాండ్‌బాగ్ పుచ్చుకొని, లిప్‌స్టిక్ వేసికొని రోడ్డు మీద టకటక నడవటమే అభివృద్ధి అయితే అటు వంటి అభివృద్ధి మనకు వద్దు అనిపిస్తుంది మన స్త్రీలలో కనిపించే ఆడవద్దిక ఇక్కడ స్త్రీలలో కనిపించదు. చదువులో ఇంత వెనకగాఉండే ఆడ వాళ్లు ఉద్యోగాలు ఎలా చేస్తారూ అనిపించ వచ్చు వీళ్లు చేసే ఉద్యోగాలు పెద్దవికావు. నర్సులు, షాపుల్లో సేల్సు ఉమెన్, టైపిస్టులు, ఫ్యాక్టరీలలో వర్కర్సు వగైరా, సాధారణమైన ఉద్యోగాలు అందరు ఆడవాళ్లు గొప్ప ఉద్యోగాలు చేయాలనిగాని, అలా చేస్తేనే గొప్పనిగాని వీళ్లు అనుకోరు. భర్త పెద్ద ఉద్యోగం చేస్తూవున్నా కాలక్షేపంకోసం భార్య చిన్న ఉద్యోగం చేయ వచ్చు ఎవ్వరూ ఏమీ అనుకోరు అయితే ఇక్కడి ఆడవాళ్లు ఉద్యోగం చేయటంలో మంచి విషయ మొకటుంది. అది క్రింద చెప్తాను

ఇక్కడ పెళ్ళయిన తరువాత తలిదండ్రులని విడచి నూతనదంపతులు వేరేకాపురం పెడతారు కొత్తల్లో పిల్లలు పుట్టేవరకూ ఇద్దరూ ఉద్యోగం చేస్తారు ఆర్థికంగా బలపడటానికి ఒక్కోసారి భర్త చదువు పూర్తి కాకుండా సగంలో ఉంటుంది అలాంటి సమయంలో భార్య ఉద్యోగంచేసి సహాయం చెయ్యటం ఇక్కడ మామూలు ఇలాంటివాళ్లు ఆర్థిక పరిస్థితి సర్దుకొనేవరకూ డాక్టరు సహాయంతో పిల్లలు పుట్టకుండా జాగర్త పడతారు కూడా. పెళ్ళయిన కొత్తలో భవిష్యత్తుకోసం ఇలా భార్యా భర్తలు ఇద్దరూ కలిసి ఉద్యోగం చెయ్యటం నాకు చాల నచ్చింది మన ఆడవాళ్లు ఉద్యోగం చెయ్యటం అలవాటయితే ఇకమానరు ఇక్కడ అలాకాదు పిల్లలు పుట్టటం మొదలవ గానే ఉద్యోగం మానేస్తారు పిల్లలు పెద్దవాళ్ళయి ఉదయమే బడికివెళ్ళి సాయంత్రం ఇంటికి రాగలిగే వయస్సు వచ్చేవరకూ గృహిణి ఇంటిని అంటి పెట్టుకొని ఉంటుంది ఆటుతరువాత వీలుని బట్టి పూర్తి ఉద్యోగం లేకపోతే పార్టు టైము ఉద్యోగమో చేస్తారు. ఎక్కువగా ఇంట్లోనే ఉండ టానికి ఇష్టపడతారు

నిత్య జీవితంలో భర్తను సంప్రదించి అతని ఇష్టానికి ఎక్కువ విలువ నివ్వటం ఇక్కడా మామూలే ఇంటికి కావలసిన అన్ని పనులు భార్యే చూసు కొంటుంది. బజారుకెళ్ళి కావలసిన సామాన్లు వగైరా కొనటం, వాటిని మోసుకొని నడిచో, బస్సులోనో కొంపకి చేరటం అంతా ఆడవాళ్లే (ఇక్కడ కూలీలు వగైరా ఉండరు) -సాధారణంగా ఎవరింటి పని వాళ్లే చేసికొంటారు పని మనుషులని భరించట మన్నది అసాధ్యం కనుక వంటచేసికొనటం, గిన్నెలు, ప్లేట్లు వగైరా శుభ్రం చేసికోవటం, ఇల్లు సర్దుకోవటం, బట్టలు ఉతికి ఇస్త్రీ చేసికోవటం, ఈ పనులన్నీ సాధారణంగా గృహిణే చేసికోవాలి కొందరికి వాషింగ్ మిషన్లు ఉంటాయి లేని వాళ్ళు సెల్ఫ్ సర్వీసు లాండ్రి కెళ్ళి వాషింగ్ మిషన్లలో ఉతుక్కొని అక్కడే వేరొక మిష నులో ఆర బెట్టుకొని తెచ్చుకొంటారు మనదేశంలో వాళ్లే బట్టలు ఉతికి ఇస్త్రీ చేసి ఇచ్చే లాండ్రీలు ఉంటాయి. కాని చాల ఖరీదు. కనుక సాధారణంగా ఎవరికి వారే వెళ్ళి ఉతుక్కొంటారు. బజారులో కొన్న సామాన్లుగాని, ఉతుక్కోవటానికి తీసుకవెళ్లే బట్టలుగాని, ఏదయినాసరే, స్వంతంగా మోసు కొని వెళ్ళవలసిందే అందరూ అలా చేసి కొనేవారే కనుక నామోషీ అనిపించదు. ఇంకొకళ్లు వచ్చి చేస్తారన్న భావం లేనపుడు ఎవరి పని వారి కలవా టవుతుంది. ఇక యిల్లు శుభ్రం చేయటం వో పెద్ద పని ఇక్కడ గదుల్లో చెక్క నేలలుంటాయి. (సిమెంటు నేలలయితే చలికి భరించలేరు) వాటి మీద ఉన్ని కార్పెట్లు ఉంటాయి. మంచి అలంకా రాలు, ఖరీదైన కార్పెట్లు ఎవరి శక్తి కొద్ది వాళ్లు గెమ్మ రూమ్ అమర్చుకొంటారు ఆ గదిని చాల శుభ్రంగా ఉంచటానికి ప్రయత్నిస్తారు. వంట గది, స్నానాలగది వగైరాలో నేలమీద ప్లాస్టిక్‌తో చేసిన పట్టాలు వేస్తారు, నీళ్లు పడ్డా చెడకుండా. ఇక్కడ పిల్లల పెంపకం చాల పద్ధతిగా ఉంటుంది చిన్నతనంలో నిర్ణీతమైన వేళకు నిద్ర పోవటం, నిద్ర లేవటం చాల పట్టుదలగా పాటిస్తారు పసిపిల్లల ఆహార విషయంలో చాల శ్రద్ధ తీసికొంటారు ఇక్కడ పసిపిల్లలు సాధార ణంగా చాల ఆరోగ్యంగా ఉంటారు. 5, 6 నెలల వయస్సునుంచీ పిల్లలను వేరేగదిలో పడుకో పెడ తారు ఇది మనకు అన్యాయంగా కనిపిస్తుంది కాని వీళ్ళకు సహజంగా ఉంటుంది ఇంతవరకూ గృహిణి ఇంటి పనులతోనూ, పిల్లలతోనూ ఇల్లు ఎలా నిర్వహించుకొంటుందో క్లుప్తంగా చెప్పాను దీన్నిబట్టి ఇక్కడ గృహిణి ఎంత కష్టపడుతుందో తెలుస్తుంది

తర్వాత నిత్య జీవితంలో వీళ్ల కాలక్షేపాలు ఎలా ఉంటాయో చూద్దాం సాధారణంగా మనకు మల్లేనే రొటీను వర్కు పరిపోతుంది అందరికీ ఇక శని ఆదివారాలు వస్తాయి. హాయిగా కుటుంబ మంతా ఇంట్లో విశ్రాంతిగా కూచుని టెలివిజన్ చూడటమో, ఇల్లు సర్దుకోవటమో చేస్తారు సినిమాలకి చాల అరుదుగా వెళ్తారు నాటకాలు చూడటమంటే వీరికి చాల ఇష్టం ఇక్కడ నాటకా లకు మంచి పోషణ ఉంది మంచి థియేటర్లు ఉన్నాయి. అంతేకాక ఆర్కెస్ట్రా, ఒపెరా, బాలే మొదలైన సాంప్రదాయికమగు లలిత కళలకు గూడ మంచి పోషణ ఉంది. మేము ఈమధ్య బాలే (నృత్య నాటిక) ఒకటి చూశాము. ప్రసిద్ధి చెందిన బృంద మట. ఓమాదిరిగా ఉందనిపించింది. ఆహార్యం గాని, అభినయంగాని మంచి స్థాయిలో లేవనిపించింది మన నాట్యములలో ఉన్న లలితమైన లాస్య విన్యాసాలు, ఆంగిక అభినయములు, అందమైన ఆహార్యాలు వీటిలో లేవనిపించింది.

ముఖ్యంగా మన నాట్యాలలోవున్న 'గ్రేస్' వీటిలో నాకు కనిపించలేదు వీళ్ళ కాలక్షేపాలు, వాతావరణాన్నిబట్టి మారుతూ ఉంటాయి వేసవి వచ్చేసరికి శని, ఆదివారములలో చుట్టు ప్రక్కల ప్రదేశములకు పిక్‌నిక్‌లకు వెళుతూ ఉంటారు. ఇక్కడ మంచి ప్రకృతి సౌందర్యం ఉన్నమాట నిజమే కాని ప్రతి చిన్న దాన్ని గొప్పగా చెప్పుకొని ఆనందించే వీళ్ళ ప్రకృతి ఇంకా కొంత తమాషాగా అనిపిస్తుంది వేసవిలో అందరూ పదిహేను లేక ఇరవై రోజులు ఇతర ప్రదేశములు చూసి వస్తారు చాలమంది కాంటినెంట్ వెళ్తూ ఉంటారు. వేసవి సెలవలు గడపటానికి దాన్ని ప్రత్యేకంగా హాలిడే టూర్ అంటారు అన్ని ఉద్యోగాలకు వేసవి శెలవలుంటాయి సుమారు రెండు వారాలపైన ఇస్తారు ఈ వేసవి సెలవలకోసం ప్రత్యేకం సంవత్సరమంతాజాగర్తగా డబ్బు దాచుకొంటారు వేసవి కోసం ఎంతోఉత్సాహంతో ఎదురుచూస్తూఉంటారు.

వీరిలో కొంత మందికి భారత స్త్రీలంటే చాల ఇష్టం మన వివాహ పద్ధతి, వస్త్రధారణ బాగుంటాయని మెచ్చుకొంటారు ఆక్స్‌ఫర్డ్ మ్యాకమర్స్ వైఫ్స్ అసోసియేషన్ అని ఒక టుంది ఆ సంవత్సరం కొత్తగా వచ్చిన ప్రతి వాళ్లు కల్సుకొంటారు ఇంతవరకూ మాకొక మీటింగ్ జరిగింది మేమంతా వో పెద్ద హాలులో కల్సుకొన్నాము వివిధ దేశాలనుంచీ వచ్చిన వారిని ఒకేసారి చూడటం నాకు చాల సంతోషంగాను ఎంతో వింతగానూ అనిపించింది ఎవరికి వారు కొత్తవారే అందరూ సుమారుగా మా మాదిరిగా స్కాలర్‌షిప్స్‌మీద వచ్చినవాళ్లే కొంత కొంతమంది ఒకచోట కూర్చుని సరదాగా కబుర్లు చెప్పుకోవటం, ఒకళ్ళ కొకళ్లు పరిచయం చేసికోవటం చాలబాగుంది. ఆక్స్‌ఫర్డ్ బాగుందా—అనడిగారు వాళ్లు విపరీతమైన చలి తప్ప మిగిలిన విషయాలన్నీ బాగున్నాయని చెప్పాను నిజంగా వాళ్ళకి నవ్వు వచ్చింది ఆ మీటింగ్‌లో భారత స్త్రీని నే వొక్కతెనే వారికి మన పట్టు చీరలంటె చాల ఇష్టం మన విష యాలు ఎన్నో నన్ను అడిగి తెల్సుకొన్నారు ఆ రోజు నేనొక మంచి పట్టుచీర కట్టుకెళ్ళాను చీర ఎంతో మృదువుగా, ఎంతో అందంగా ఉందని ఇంకా ఎన్ని ఇలాంటి చీరలున్నాయని అడిగారు వాళ్లకి అంత ఇష్టమన్నమాట అంతా తెలియనివాళ్లకదా. ఓగంట సేపటిలో తిరిగి వద్దామనుకొన్నాము. మేము కబుర్లు చెప్పుకొంటూ ఇంక ఇంటికి బయరుదేరుదామని టైము చూసు కొనేటప్పటికి రాత్రి పదకొండు గంటలు దాటింది. నన్ను వాళ్లే కారులో ఇంటికి తీసికొచ్చి దింపి వెళ్ళారు. ఆరోజు చాల సరదాగా గడిచిందనిపించింది వాళ్ళతో. 








గ్లాసెడు
కిసాన్ స్క్వాష్‌తో
వేద దీర్చుకోండి

ఎంత రుచియైనది, ఉల్లాసం కలిగిస్తుంది. ఆరోగ్యకరమైనది. చెట్టున పండిన పండ్లతో చేసినది... విటమిన్లు పుష్కలంగా కలది. నారింజ, నిమ్మ మొదలైన ఆరు రకాలలో దొరుకుతుంది.

ఇండియాలో దొరికే స్క్వాష్‌లలో పోటీలేని ప్రఖ్యాతి, ప్రచారం గలది.



కారట్




అన్నిచోట్ల దొరకును

# సాఫల్యం

భూపతి



## పెద్దకథ: 3వ భాగం

(గత సంచిక తరువాయి)

మరో కొన్ని నెలలు గడిచాయి.

ఒకనాడు శేషగిరి ఇంటికి వెళ్ళాను "జయ లేదేమిటి?" అన్నాను అతను వంట చేసుకోడం చూసి

శేషగిరి కన్నీరు వత్తుకున్నాడు. నేను ఆశ్చర్య పోయాను.

"లేదు. ఏదో వూరు వెళ్ళింది" అన్నాడు

నేను గడపమీద కూర్చున్నాను. శేషగిరి నిట్టూర్చి, "నువ్వు చెప్పింది వేదాక్షరాలనుకోరా. ఆనాడు నీమాట కాదన్నాను ప్రేమ, ప్రేమ అని గుడ్డి వాణ్ణి అయ్యాను మేనమామ కూతుర్ని పెళ్ళి చేసుకుని అమ్మని ఆనందపరచినవాణ్ణి కాదు ఇటు నేను సుఖపడలేదు నాకు జీవితం మీద ఆశ సన్నగిల్లుతోంది" అన్నాడు నాకు ఏమీ అర్థం కాలేదు "ఏమిటి? అసలు ఏం జరిగింది" అన్నాను. శేషగిరి టూకీగా చెప్పాడు.

నేను ఉలిక్కిపడ్డాను

"ఛీ లేనిపోని అనుమానాలు పెట్టుకోక జయ అలాటి మనిషికాదు" అన్నాను. శేషగిరి నవ్వాడు. "నేను అలానే అనుకున్నాను కానీ మన కళ్ళు మనని మోసం చెయ్యవుగా!" అంటూ లేచి, పక్క గదిలోకి వెళ్ళి కొన్ని ఫోటోలు తెచ్చి చూపించాడు నా కళ్ళను నేనే నమ్మలేకపోయాను జయ పక్కన శేషగిరి స్థానంలో ఎవరో ఉన్నారు ఇంతవరకు ఎలా జరిగిందో నాకు బోధపడలేదు

"ఇవి చాలావరకు నడిచింది రాజా దాన్ని దాని ఇష్టం వచ్చినట్టు తిరగనిచ్చాను. "స్త్రీ స్వాతంత్ర్య మర్యాతి" అన్న పదం వ్యర్థపదం అని వాదించాను కోరినంత డబ్బు ఇచ్చాను కానీ దాని బుద్ధి ఇలా పెడదారిన పడుతుందనుకోలేదు ఇది నలుగురికీ తెలిస్తే నేను ఎలా ముఖం ఎత్తుకుని తిరుగుతాను" అని కంట తడిపెట్టుకున్నాడు.

"పాపేది" అన్నాను.

"పనిమనిషి తీసుకువెళ్ళింది" అన్నాడు.

కాఫీ కాచాడు. ఇద్దరం తాగాము ముందు గదిలోవచ్చి కూర్చున్నాక, మళ్ళీ ప్రారంభించాడు "రాజా! ఈ విషయం నీతో చెప్పాలని రెండు మూడు నెలల్నుంచి ప్రయత్నిస్తున్నాను. ఇలాంటి విషయాలు పరాయివాళ్ళతో చెప్పడం అంత ... ఒక మనిషి ఎంత మానసిక బాధకు గురి అవుతాడో ఆలోచించు. కానీ, ఏం చేస్తాం. బ్రతికుండగా అమ్మను పెట్టిన క్షోభ ఇలా నన్ను నాశనం చేయక మానుతుందా!" అన్నాడు గోరంతలు కొండంతలుగా ఆలోచించడం శేషగిరికి ఒక అలవాటు. అరకంగా వూహిస్తున్నాడేమో అనుకున్నాను. కానీ ఆ పరిస్థితుల్లో మనస్సు ఎంత బాధపడుతుందో వూహించడం నాలాటి వాడికేమీ కష్టంకాదు. రమని నేను ప్రేమించి పెళ్ళి చేసుకుందామని వూహించినపుడు జయ విషయంలోనూ అలాగే అయినపుడు నేను పొందిన బాధ గుర్తుకు వచ్చింది

ఆరాత్రి పదకొండింటివరకు శేషగిరి ఏవేవో వేదాంత ధోరణిలో కబుర్లు చెపుతూనే ఉన్నాడు. వాణ్ణి ఓదార్చి, రూముకు చేరేసరికి పన్నెండయింది ఆ తరువాత నెలరోజులు గడవకముందే శేషగిరికి తిరుచునాపల్లి ట్రాన్స్‌ఫర్ అయ్యింది. వెళ్ళేముందు నాతో కాసేపు మాట్లాడాడు. మనిషిలో హుషారు పోయింది వేదాంతిలా తయారయ్యాడు "రాజా, ఉత్తరం రాస్తే సమాధానం రాస్తావా? ఆపదలో ఆదుకునేవాడె స్నేహితుడు అంటారు నా కేదైనా ఆపదవస్తే ఆదుకుంటావనే ధైర్యంతో వెళుతున్నాను" అన్నాడు.

"ఛ ఏమిటా చాదస్తం" అన్నాను

"వెళ్ళొస్తామండి" అంది జయ శేషగిరి పాపను నా దగ్గర్నుంచి తీసుకుని "మావయ్యతో వెళ్ళొస్తామని చెప్పమ్మా" అన్నాడు పాప కేరింతలుకొడుతూ చెయ్యి వూపింది నా శరీరం పులకరించింది. కళ్ళు చమర్చాయి

వాళ్ళు వెళ్ళిపోయారు

* * *

నా జీవితం మరీ పొడి అయిపోయింది వారానికి ఒక్క ఉత్తరమైనా శేషగిరి రాసేవాడు అంతా వేదాంతమే!! వీలున్నంతవరకు అతన్ని ఉత్సాహ పరుస్తూ రాసేవాడిని

ఓ నాలుగు నెలలు గడిచాయి

ఉన్నట్టుండి శేషగిరి వచ్చాడు "నీతో ముఖ్యమయిన పనుండి వచ్చాను" అన్నాడు వెంటనే ఆ పూట శలవు పెట్టాను ఇద్దరం కాఫీతాగి, రూముకు చేరాము శేషగిరి మౌనంగా కన్నీరు కార్చి, తుడుచుకున్నాడు నేనతనికేసి చూశాను. అతని ప్రాణాలు కళ్ళల్లో ఉన్నాయి మనిషి చిక్కి శవంలా అయిపోయాడు మానసిక ఆరోగ్యం లేనివాడిని ఔషదాల్లో పాతేసినా పిసమెత్తు ప్రయోజనం ఉండదు

"అంతా అయిపోయిందిరా రాజా! చిన్న పొద్దున్నతో ఋణానుబంధం తీరిపోయింది నాతో తనకి సౌఖ్యం లేదని చెప్పింది పొరపాటు సరిదిద్దుకునే సమర్థత, తెలివి తనకు ఉన్నాయంది విడాకుల పత్రాలు తెచ్చింది వాడూ వచ్చాడు సంతకం పెట్టమంది పెట్టేశాను అన్నీ అయిపోయాయి" అన్నాడు వెక్కి వెక్కి చంటి పిల్లాడిలా ఏడుస్తూ.

"ఎంత పని చేశావ్" అన్నాను నేను.

"అంతకన్నా ఏంచెయ్యగలను? ఏం చెయ్యాలి? రాజా! తల్లిని పెట్టిన క్షోభకు నాకీ శిక్ష చాలదురా చాలదు" అన్నాడు కాస్సేపాగి, "రాజా! నువ్వు అజన్మాంతం వివాహం చేసుకోవద్దు.

(బ్రహ్మచారిగా ఉండిపో—జీవితాన్ని మలినం చేసు కోక— నా మాట విను" అన్నాడు ఆవేశంతో.

"మరి పాప సంగతి?" అన్నాను నేను.

శేషగిరి కన్నీరు తుడుచుకున్నాడు.

"ఆ ఒక్క వరం ఇచ్చింది. పాపను నాకు ఇచ్చింది" అని దీర్ఘంగా నిట్టూర్చి, "అవున్లే— స్వేచ్ఛ కోసం అది పోతుంటే మళ్ళీ ఈ ప్రతి బంధకం ఎందుకు? నేను అడగకపోతే పాపని ఏ అనాథ శరణాలయంలోనయినా అప్పగించేసి ఉండును" అన్నాడు.

"ఎంత పని జరిగింది" అన్నాను నేను. నా గీతేగాక, నాకు సన్నిహితులు, హితులు, బంధువులు, స్నేహితులు—వాళ్ళందరి గీతలు కూడా ఇలా విషాదాంతం అవ్వాల్సిందేనా? ఏమిటీ శాపం!

మళ్ళీ శేషగిరి ప్రారంభించాడు.

"నేను ఇన్నొక వరం కోరుకుందామని వచ్చాను" అన్నాడు.

"ఏమిటది" అన్నాను.

"నాకు జీవితాన్ని పరిహసించి ఎదురు నిలబడే శక్తిలేదు నేను పిరికివాణ్ణి. ఒకవేళ జరగకూడనిది ఏదైనా జరిగితే పాపకి తండ్రివి నువ్వే— నా పాపను పెంచి పెద్ద చేస్తానని మాటిస్తావా?" అన్నాడు. అతని కంఠం రుద్ధమయ్యింది. నేను లేచి అతని భుజంమీద చేయివేసి, "ఛీ ఏమిట్రా అది? గోరంతలు కొండంతలుగా వూహించుకుని అలా ఆడదానిలా ఏడుస్తావేమిటి? ఛీ ధైర్యంగా ఉండాలి. నన్ను చూడు, ఈ విశాల ప్రపంచంలో ఏకాకిని. అయినా రాయిలా తిరుగుతున్నాను. నన్ను చూసి ధైర్యం తెచ్చుకో" అన్నాను శేషగిరి తల అడ్డంగా వూపి, "అది సరి ముందు నే నడిగిన దానికి సమాధానం చెప్పు నువ్వు పెంచలేకపోతే అనాథ శరణాలయంలో చేర్చు అంతేకాదు. నేను అది, పాపకి తలి దండ్రులమైనట్టు తెలియకూడదు. పాప జీవితం మా మలినాలు తగులకుండా ఉండాలి. దాన్ని నీ కప్పగిస్తాను ఈ బాధ్యత నువ్వు తీసుకోగలవా" అన్నాడు నా రెండు చేతుల్లో తన ముఖం దాచుకుంటూ.

"అలాగే పాపని పెంచి పెద్దచేస్తాను సరేనా" అన్నాను.

శేషగిరి కన్నీటిని తుడుచుకుని, "నా కా ధైర్యం ఉంది రాజా! నువ్వు దేముడివి అందుకే ఈ వరానికి ఇక్కడ కొచ్చాను ఇక నేను వెళ్తాను పాప అక్కడ వక్కర్తే ఉంది" అన్నాడు.

"పోనీ రాత్రి ఉండిపోకూడదా" అంటే వినలేదు.

"రాజా! నేను చెప్పినది మర్చిపోక నా ఆశ లన్నీ నీమీదే పెట్టుకున్నాను" అంటూ వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి మళ్ళీ నాకు కాళరాత్రయ్యింది

భగవంతుడు మనుష్యుల జీవితాలతో ఎందుకిలా ఆడుకుంటాడు? ఇదంతా పూర్వ జన్మ పాపమేనా? పూర్వ జన్మలో చేసిన పాపం అనే వంకన ఎంత శిక్షయినా విధించడానికి భగవంతునికి హక్కు ఎవరిచ్చారు?

భగవంతుడు నియంతా?

ఈ నియంతృత్వానికి హద్దుల్లేవా?

వాడెవడో రాజా చదరంగంలో మనుష్యులను, ఏనుగులను, గుర్రాలనుపెట్టి ఆడేవాడట అవతల అవి చావవలసివస్తే నా బంటు చచ్చాడు నా ఏనుగు చచ్చింది అని వాటిని చంపేసేవాడుట దేముడు కూడా అలా ఆడితే ఎలా? ఎన్ని ప్రాణాలు మల మల మాడిపోతున్నాయి? ఎందరు చావలేక బ్రతుకుతున్నారు?

ఇదంతా దేవుడికి ఎవరు వచ్చచెప్తారు!

చెప్తే వింటాడా? అసలు చెప్పేదెవరు?

ఈరకం మాటలు దైవ దూషణవల్ల ప్రయోజనం ఉండదని తెలుసు. అయినా ఆవేశంతో ఏవేవో వూహాగానాలుచేస్తూ పడుకున్నాను తెల్లవారి ఎవరో తలుపు తట్టడంతో మెలకువ వచ్చింది. ఎదురుగా—తలుపు తీసేసరికి పోలీసులు నేను కొయ్యబారిపోయాను ఏదో హోటల్లో శేషగిరి ఉరి పోసుకుని చనిపోయినట్టు చెప్పారు వాళ్ళు. నా పేర ఒక ఉత్తరం రాశాడట. వాళ్లిచ్చిన ఉత్తరం జేబులో పెట్టుకుని, వాళ్ళ వెనుక పరిగెత్తాను శేషగిరి శరీరం చూసేసరికిన నాకు మైకం వచ్చినట్టయ్యింది అతని శరీరం చాలా భయంకరంగా తయారయ్యింది కళ్ళల్లోంచి నెత్తురు వచ్చింది నాలుక వికృతంగా బయటికి వచ్చింది. పోలీసు ఇన్స్పెక్టరు ఇచ్చిన ఉత్తరాన్ని చదువుకున్నాను పాప పెంపకం నాకు వప్పగించాడు. పాపపేర బ్యాంకులో ఐదు వేల రూపాయ లున్నట్టు రాశాడు తన ఆత్మహత్యకి తన అనారోగ్యమే కారణమని, ఎవరూ కారణం కాదనీ రాశాడు. కానీ నిజం నాకు, జయకు, అతనికి తెలుసు.

లోకాన్ని మంచిగా నమ్మింప చూశాడు శేషగిరి.

ఆనాడే ఆ ఉత్తరం తీసుకుని తిన్నగా తిరుచునాపల్లి వెళ్ళాను జయ నన్నుచూసి కంట తడి పెట్టుకుంది. "వారు ఆత్మహత్యకి పాల్పడతారనుకోలేదు. నిత్యం గృహ కల్లోలాలతో కాపరం చెయ్యడంకన్నా విడిపోవడమే మేలని అలా చేశాను. ఇలా జరుగుతుందని అనుకోలేదు ఆయన దేవుడిలాంటివారు. భగవంతుణ్ణయితే పూజ చేస్తాం. కానీ కేవలం భర్త అనేవాడు పూజ చేయించుకోడానికి కాదుకదా! సుఖం, అనురాగం, ఆప్యాయత ఇవన్నీ ఒక స్త్రీ భర్త దగ్గరనుంచి కోరుకుంటుంది అదీగాక, తన ఆశయాలు, కోరికలు నెరవేరాలనుకుంటుంది అవన్నీ తీర్చని భర్త కేవలం పూజా విగ్రహమయితే—ఆ స్త్రీ నిగ్రహించుకోడం కష్టం పంజరంలో బంధించినకొద్దీ చిలక్కి పారిపోవాలనే కోర్కె ఎక్కువవుతుందంటారు నేనాయన్ని భర్తగా చూడాలని ఆశించాను. ఆయన దేముడిలా ప్రవర్తించేవారు అందుకు ఇలా జరిగింది కానీ ఇలా జరుగుతుందనుకోలేదు" అంది.

జయ చెప్పినదాంట్లో నిజం లేకపోలేదు.

ఆ తరువాత పాప విషయం వచ్చింది.

"వారి కోర్కె ప్రకారమే పాపను మీరు తీసుకోండి పాప నాలాంటి పాపి దగ్గరుంటే నా మాలిన్యాలు దానికి వస్తాయి నా కంఠంలో ప్రాణం పోయేలోగా ఆ సర్వేశ్వరుడి దయ కలిగితే పాపని చూచి మరీ ప్రాణాలు వదుల్తాను" అంది, పాపను కడసారిగా ముద్దు పెట్టుకుని, హృదయానికి హత్తుకుంటూ. నా కళ్ళు చమర్చాయి.

నేను తీసుకుంటున్న బాధ్యత చాలా పెద్దది.

జయ పాపను చేతిలోపెట్టి, ముఖానికి పైట చెంగు వేసుకుని, వెక్కి వెక్కి ఏడ్చింది పాప నా మెడ చుట్టూ ఒక చెయ్యివేసి రెండో చేత్తో నా కాలరు పట్టుకుంది. జయను వోదార్చి ఆరోజే మళ్ళీ వూరు చేరాను

శేషగిరిలా నేను ఆత్మహత్య చేసుకోకుండా ఉండాలనే భగవంతుడు నాకు ఈ పాపను కావలా పెట్టాడు. పాపను నా చేతులమీదుగా పెంచాలి. గుణవంతురాలిగా చెయ్యాలి పాపకు తల్లినీ, తండ్రినీ నేనే అవ్వాలి. ఆమెకు తన తలిదండ్రుల విషాద



చరిత్ర తెలియనివ్వకూడదు అని నిశ్చయించు కున్నాను

గోడకి వేళ్ళాడుతున్న వెంకటరమణుని పటా నికి నమస్కరించి, "తండ్రీ! ఆవేశంలో నిన్ను దూషించి ఉండచ్చు అవన్నీ క్షమించు పాపని పెంచి పెద్దదాన్నిచేసే శక్తి, స్థైర్యం, నాలో కలుగజెయ్యి. వైవాహిక వాంఛ నాలో ప్రవేశించ నీయకు పాపని ఆరోగ్యవంతురాలిగా చెయ్యి తండ్రీ" అని ప్రార్థించాను

ఆనాడే పాపకి సుశీల అని పేరు పెట్టాను. సుశీల

పాప సుశీల కావాలని వాంఛించాను

"—బాబయ్యగారూ, ఏవిటి కలవరిస్తున్నారు" అంటూ సుశీల నన్ను కుదిపింది ఉలిక్కిపడ్డాను మగత వదిలింది, లేచి కూర్చుంటూ, "కలవ రించానా" అన్నాను

"అవును ఉన్నట్టుండి సుశీల అనరిచారు" అంది

"ఏదో నీమీద పీడకల వచ్చిందమ్మా" అన్నాను

"ఎప్పుడూ మీకు నన్ను గురించిన ఆలోచనే పీడ కలలు రాకేం చేస్తాయి" అంటూ వో గ్లాసుడు మంచి నీళ్ళు ఇచ్చి, "త్రాగి పడుకోండి" అంది మంచినీళ్ళు త్రాగి పక్కమీద వాలాను సుశీల నా కాళ్ళ దగ్గర కూర్చుని, "అమ్మ గుర్తుకు వచ్చిం దేమో అనుకున్నాను" అంది

"అవునమ్మా" అన్నాను.

"పడుకోండి" అంది సుశీల

కళ్ళు మూసుకున్నాను సుశీల నా పక్కమీద చాలాసేపు కూర్చుని, నేను నిద్ర పోయానని తలుచుకుని వెళ్ళి పడుకుంది నేను శారీరకంగా పడుకున్నా, విశ్రాంతి తీసుకున్నా, మానసికంగా విశ్రాంతి తీసుకోడమనేది జరగని పని

"—ఎన్ని కష్టాలోపడి సుశీలని పెంచాను సుశీలని నా కప్పగించాక నేను మధుర వదిలేసి, విశాఖపట్నం వెళ్ళిపోయాను విశాఖపట్నంలో అవధానులుగారు నన్నుచూసి పరమానందపడ్డారు "నా కూతురు సుశీల" అని చెప్పాను అంత అబద్ధం నా జీవితంలో ఎప్పుడూ చెప్పలేదనుకుంటాను అవధాన్లుగారు నమ్మినట్టు కనబడలేదు ఆ రాత్రి అడిగారు నేను నాకు తెలియకుండా నేమెత్తపడ్డాను సుశీల కధంతా ఆయనతో టూకీగా చెప్పి "సుశీ లకి తల్లీ, తండ్రీ అంతా నేనే" అన్నాను.

ఆయన కన్నీరు పెట్టుకున్నాడు

"నువ్వు నిజంగా చాలా గొప్పవాడివి నీ జీవితం ధన్యమయింది ఇలాటి పని సాహసించి ఎవరూ చెయ్యలేరు" అన్నారు నేను ఆనందంతో ఉప్పొంగి పోయాను ఆ తరువాత ఆయన, నేను, సుశీల మా వూరు వెళ్ళాము నాన్నగారితో నా గొప్ప గుణాలన్నీ అవధాన్లుగారు చెప్పారు నాన్నగారు చాలా చెప్పాక నాతో మాట్లాడడానికి అంగీకరించారు

"జీవితాలు భగవన్నిర్ణయాలు నీ జీవితం ఇలాటి మలుపు తిరగాలని సృష్టికర్త నిర్ణయం అయితే ఎవరేం చేస్తారు? పోనీలే—నీకూ ఒక బాధ్యత అప్పగించాడు ఉద్యోగం వద్దు ఏమీ వద్దు ఇక్కడే ఉండు" అన్నారు.

"ఈ రహస్యం ఎవరికీ తెలియకూడదు. సుశీల నా కూతురుగానే పెరగాలి" అన్నాను నేను నాన్న గారు కన్నీరు తుడుచుకుని "అలాగే" అన్నారు

నా భార్య చనిపోయినట్టు మా వూరంతా సానుభూతి చూపించారు కొంతమంది మళ్ళీ పెళ్ళి చేసుకోమని సలహా చెప్పి చూశారు

అక్కడ ఒక సంవత్సరం గడిపాను నాన్నగారి అనారోగ్యం వయస్సుని ఆధారంగా తీసుకుని విజృం భించింది జబ్బుతో తీసుకుని రెండు నెలలు తిరగక ముందే చనిపోయారు

ఈసారి నేను ఏకాకిని కాను

నన్ను 'నాన్నా' అని పిలిచే సుశీల ఉంది నాన్న గారు పోతూ తన ఆస్తి అంతా సుశీల పేరపెట్టారు. సుశీల తండ్రిగా నేను ఆ ఆస్తిని అనుభవించలా చేశారు

నాన్నగారు పోయాక, ఇక ఆ వూళ్ళో ఉండ బుద్ధి కాలేదు రమ ఎలా ఉందో! ఎక్కడ ఉందో!! ఒక్కసారి బొంబాయి వెళ్ళి వెతికితేనో అనిపిం చింది బొంబాయి వెళ్ళి గాలించాను బొంబాయి లోనే ఒక ఉద్యోగం సంపాదించాను ఒక సంవ త్సరంపాటు అక్కడ ఉన్నాను నా కంటికి రమ గాని, జాఫర్‌గానీ కనబడలేదు మరో సంవత్సరం ఉండేసరికి బొంబాయి జీవితంమీద ఆశక్తి చచ్చింది హైదరాబాద్ వెళ్ళాను మామయ్య నన్ను చూసి చాలా ఆనందించాడు 'రమ ఉనికి తెలిసిందా' అని అడిగాను

"దాని వూసెత్తక" అన్నాడు తను

నా భార్య చనిపోయిందని అత్తయ్యా మామయ్యా చాలా విచారించారు "ఇంత చిన్నపిల్లని ఎలా పెంచుతానయ్యా నువ్వు మళ్ళీ పెళ్ళి చేసుకోరాదూ" అన్నారు

"చిన్నపిల్లల్నే గదా మనం పెంచేది పెద్ద వాళ్ళను పెంచేదేముంది" అన్నాను "అవును" అన్నాడు మామయ్య

వాళ్ళింట్లో నాలుగు రోజులుండి హైదరా బాదు వదలి విశాఖపట్నం చేరాను అక్కడ మరో ఉద్యోగంలో చేరాను ఇక ఉద్యోగం మానకూడ దని నిర్ణయించుకున్నాను జీవితం కాస్త కుదట పడింది అనుకోబోయేసరికి అవధానులుగారు హఠా త్తుగా చనిపోయారు

ఆరుబైట మంచంమీద పడుకుని, దీపాలవేళ ప్రాణం వదిలేశారు నాకున్న ఆ ఒక్క అండా కూడా పోయింది ఇక నా జీవితంలో సంతృప్తి అనేది రాదా అని ఏడ్చాను సుశీల ఆ భయంకర వాతావరణానికి భయపడిపోయింది

నా రహస్యం ఎలాగో బయట పడింది ఆయన రెండు నెలలు తిరక్కముందే సుశీల నా కూతురు కాదని ఇరుగు పొరుగులు అనేవరకు వచ్చింది. భయంతో నా శరీరం గజగజ లాడిపోయింది ముద్దు ముద్దుగా సుశీల మాట్లాడే రోజుల్లోనే అనుమానబీజాలు నాటారు "నాన్నా! నువ్వు మా నాన్నవి కాదుటగా" అంది సుశీల ఒకనాడు నా దగ్గ రకువచ్చి నా శరీరం జిలార్చుకుపోయింది ఇక ఆ వూళ్ళోఉంటే చాలా ప్రమాదం అనిపించింది.

ఆరోజే ఎవరితో చెప్పకుండా ఉద్యోగానికి రాజీ నామా ఇచ్చి మద్రాసు చేరాను సుశీల నాన్నా అని పిలుస్తుంటే ఏదో బాధగా ఉండేది సుశీ లకు అన్యాయం చేస్తున్నాననిపించేది నెమ్మదిగా "బాబాయ్" అని పిలవడం చెప్పాను మనని గురించిన విశేషాలు ఎవరికి తెలియకూడదనుకుంటే ఎవరితోనూ ఎక్కువగా మాట్లాడకు" అనేవారు నాన్నగారు ఆ పద్ధతి అవలంబించాను ఒక్క నెల్లాళ్ళు కష్టపడి ఒక కంపెనీలో ఉద్యోగం సంపా దించాను

జీవితంలో ఈసారి పూర్తిగా స్థిరపడినట్లే అనుకున్నాను ఒక ఆరవ వంటమనిషిని పెట్టాను. సుశీలని కాన్వెంటులో చేర్చాను

నా జీవితం దశ తిరిగింది

ఉద్యోగంలో స్థిరపడడమే గాకుండా జీవితంలో కూడా స్థిరపడ్డాను అదిగాకుండా సంవత్సరం తిరిగేలోగా ఉద్యోగంలో కొంత ప్రమోషనువచ్చింది

సుశీలకి ప్రయివేటు మేష్టర్నుపెట్టి సంస్కృతం నేర్పించడం ప్రారంభించాను.

ఆ తరువాత ఆలోచించుకోవలసిన, గుర్తుం చుకోదగిన విశేషాలు నాజీవితంలో లేవు—ఇప్పుడు సుశీల పుస్తకంలో ప్రేమలేఖ చూసేసరికి పది హేనేళ్ళనుంచి స్థిమితంగాఉన్న మనస్సు కలత పడింది

మళ్ళా నాకు శని పట్టిందేమోననుకున్నాను

ఈ పదిహేనేళ్ళకూ మళ్ళీ ఈనాడు నా మనసు కలత బారింది జాఫర్ పేరు గుర్తుకు వచ్చింది పెళ్ళి బాజాలతో ఆరంభమయిన గతం—గతమంత చుట్టు చుట్టేసి, భవిష్యత్తు దగ్గర ఆగింది.

(సశేషం




"ఏంటోయ్ గిరీ ఏదో బెంగెట్టుకున్నవి మరి పొట్టిగా తయారయ్యావూ...

"పొడుగు పెరగాలని బెంగ"

# ప్రసిద్ధతార ఆత్మకథ ప్రారంభం!



'సలోమ్' చిత్రంలో రీటా...

# ప్రేమా పురుషులూ నేనూ

రీటాహేవర్త్

నన్ను గురించి నేనే రాసుకోవడం పెద్ద సాహసమే అనిపించింది కాని ఒక మిత్రుడు నాతో అంగీకరించలేదు. "నువ్వు వద్దనుకున్నావరే నువ్వు ప్రపంచానికి ఒక కామదేవత చిహ్నం అయి వూరుకున్నావు. నిజం చెప్పు చాలు," అన్నాడు. నే నిప్పుడు చెయ్యబోయేదీ అదే!

నేను చాలా తప్పులు చేసినమాట నిజం. అయితే నేమి? నా జీవితంలో ఒక్క విషయం కూడా మరో విధంగా జరిగి ఉండాలని నేను అనుకోను. అటువంటి అవకాశమే గనుకవస్తే వాడుకోను. వళ్లు తెలిని కోపంతో అన్నమాటన్ని కూడా ఉపసంహరించుకునేదాన్ని కాదేమో!

## వృద్ధాప్యం...నిర్భయం

నేను జీవితంలో ఎన్నో కష్టాలకి లోనయ్యాను. చాలా విషాదానుభవాలు కలిగాయి. కాని నా కూతుళ్లిద్దరూ నా భాగ్యంకొద్దీ నాకు కలిగారనిపిస్తుంది. రెబెక్కా, యాస్మిన్‌లు జీవితంలోని మంచితనానికి చిహ్నాలు.

ఇప్పుడు నాకు 44 ఏళ్లు నిండాయి అయినా ముసలితనం వస్తుందని నేను భయపడటంలేదు. నా ఇల్లు నా కొక శరణు అయింది. ఇప్పుడు నా అర్జన నాది. నా ఖర్చులు నావి.

నేను మొత్తం అయిదుమందికి భార్యనయ్యాను. కాని ఒక్కరిదగ్గర నుంచీ విడాకులు పుచ్చుకోలేదు. ఈ అయిదు వివాహాలవల్లా మిగిలినవి పాత స్మృతులు మాత్రమే. నేను స్వతంత్రురాలిని. అదే చాలు.

అసలు నాకే విచారమూ లేదా? నాకూ ఇల్లు కావాలి—అంటే ఒక కట్టడం చాలదు. అంటే, ఇంకా ఒక పురుషుడి సహచర్యం, అండ కావాలన్న మాటే. కాని ఈ పురుషుడు నన్ను ఒక వ్యక్తిగా స్వీకరించాలి.

ఈ వ్యాసాలు చదివిన తర్వాత నా అభిప్రాయం ఏమిటో మీకు బాగా అర్థమవుతుంది. ...

## కారడవిలో కామదేవతను

హాలీవుడ్ ఒక కారడవిలాంటిది. దానిలో చిక్కుకుని బయట పడటం తేలికకాదు. అక్కడే నన్నొక 'కామ దేవత చిహ్నం'గా మార్చేశారు

అందుకనే నేను నా పాత హోదాని తల్చుకుని గర్వపడుతూ ఉంటాను నిజంగా నేను 'హాలీవుడ్ సౌందర్య రాణు'లలో ఒకర్తెను.

గొప్ప చెప్పుకుంటున్నాననిపిస్తోందా మీకు? ప్రగల్భాలు పలకటంకాదుగాని నేను చెప్పింది నిజం.

ఎక్స్‌ట్రాగా మొదలుపెట్టి తారనయ్యాను. స్టంటు సినిమాల్లో తెరమీద 'అలంకరణ'గా మాత్రం అగుపించేదాన్ని మొదటి రోజుల్లో!

ఈరోజు నా టెలివిషన్ పెట్టుముందు కూర్చుని నా పాత సినిమాలు చూస్తూఉంటే భూతకాలపు స్మృతులు నాతో మెదులుతూ ఉంటాయి.

# "హాలీవుడ్ ఒక కారడవిలాంటిది. దానిలో చిక్కుకుని బయటపడటం తేలికకాదు."

వింట్రాప్ సార్జెంటు నన్ను గురించి రాస్తూ 'ఈమె ఒక లవ్ గాడెస్' (ప్రేమదేవత?) అన్నాడు. అప్పటినుంచీ నా పేరు అదే అయి పూరుకుంది! ఆ బిరుదు నాకు తగినదేనా? ఏమో!

**అటంబాంబు మీద నా బొమ్మ వేశారుట. అందుకనే ఆ బిరుదు తలుచుకుంటే కొంచెం బాధపడటం కూడా నాకు అలవాటయింది.**

ఒక్కొక్కసారి అద్దంలో చూసుకుని నన్ను నేనే ప్రశ్నించుకుంటాను—"నన్ను కామదేవత చిహ్నంగా ఎందుకు వూహిస్తారు?" అని.

కాని కొన్ని సమయాలలో "నిజంగా అందగత్తెనే!" అనిపించేది నాకు. నన్నెందరో ప్రేమించారు. నేనూ ప్రేమ అనుభూతిని చవిచూసిన దానినే

## అరవై చిత్రాల్లో...

నేను మొత్తం 60 చిల్లర బొమ్మలలో వేశాను వాటిలో కొన్ని మాత్రమే నాకు నచ్చాయి. తక్కినవాటిలో ఎంతమార్చినా నా పాత్ర 'సలోమ్' పాత్రే ....

కొన్ని వార్తా పత్రికలు నన్ను నీతిగా బతకటం చేతకానిదాన్నిగా, ధనదాహం కలదానిగా చిత్రించాయి

నిజానికి నేను నటిని మాత్రమే. తెరమీద నా ప్రతిభకి తగినస్థానంకోసం మాత్రం ప్రయత్నించిన వ్యక్తిని నా నటనా కౌశల్యాన్ని ప్రదర్శించే అవకాశంకోసం ఎదురు చూసిన నటిని.

ఆ అవకాశం నే నింత పేరు సంపాదించిన తర్వాత గాని రాలేదు. నా పాత కాంట్రాక్టులన్నీ ముగియటానికి ఎంతో కాలం పట్టింది!

గత 6 సంవత్సరాలుగా కేవలం 'రిటాహేవర్త్' కాక నా ప్రతిభకి అవకాశం ఇచ్చే పాత్రలని మాత్రమే కోరుతూ వచ్చాను.

అసలు మా నాన్న నాట్యంచేసేవాడు. అతనే కాదు, ఎడువార్డో కాసినో (ఆయన పేరు), ఆయన ఎనిమిది అన్నదమ్ముళ్ళూ, మా అత్త ఎల్సా— అందరూ నాట్యం వచ్చినవారే.

మా అమ్మ వైపు వారు—ఆవిడ ఇంగ్లండ్, ఐర్లాండ్ తాలూకు మనిషి— కూడా రంగస్థలంతో సంబంధం ఉన్నవారే మా అమ్మా, నాన్నా 'జ్పైగ్‌ఫీల్డ్ ఫాలీస్' లో కలిసి ప్రేమించుకుని వివాహం చేసుకున్నారు.

## జన్మస్థలం..

నేను న్యూయార్క్ పక్కన బ్రూక్లిన్‌లో పుట్టాను. నా అసలుపేరు మార్గరిట్ కార్మెన్ కాసినో. మా అమ్మా, నాన్నా ఇద్దరూ నల్లటి జుత్తుతో కొంచెం రంగు తక్కువగా అందంగా ఉండేవారు.

నా చిన్నప్పుడు నాకు గిలక కొనివ్వలేదు చిరతలు బహుమతిగా ఇచ్చారు! మా స్పానిష్ తాతగారు స్వయంగా చేసి ఇచ్చాడు వీటిని. నడవటం వచ్చినప్పటినుంచీ నృత్యాభ్యాసం చేయించాడు మా నాన్న. అయిదవ ఏటికే నాకు బాగా ఆట వచ్చింది.

## రంగస్థల ప్రవేశం

**నా ఆరవఏట రంగస్థలం మీదకి మొదటిసారిగా ఎక్కాను - చాల్టిమూర్ పట్నంలో. కాని ఎలా ఎక్కాను? మా అమ్మా నాన్నా డాన్స్ చేస్తూఉంటే చూసి సంతోషం పట్టలేక స్టేజిమీదకి నడిచివెళ్ళిపోయాను. అయితే ఇది నాట్యం ముగిసిన సమయానికే కాబట్టి ఎవరికీ చిరాకు కలిగించలేదు!**

నాట్యంమీద అభిమానం కొద్దీ బాగా అభ్యాసం చేశాను. మా కుటుంబం అమెరికా అంతా తిరిగి, తిరిగి ఆఖరుకి హాలీవుడ్‌లో స్థిరపడిపోయింది అక్కడ మా నాన్నగారు ఒక నాట్యంనేర్పే బడి ప్రారంభించారు నేనూ ఆ పాఠశాలలో తరిఫీదు పొందాను

తొమ్మిది సంవత్సరాలు వచ్చేసరికి నాట్యం నాకు బాగా అలవాటయింది నాకు స్నేహితులు తక్కువగా ఉండేవారు. దీనివల్ల నా అభ్యాసం మరింత బాగా జరిగింది

నా పదమూడవ ఏట మా నాన్నగారితోబాటు 'టిజువానా' లో ఒక క్లబ్బులో డాన్స్ చేసేదాన్ని నేను అంతకన్నా పెద్దదానిగా కనిపించినా మా నాన్న చిన్నవాడుగా కనిపించేవాడు!

## క్లబ్బుల్లో రాత్రి విహారం

ప్రతిరోజూ 12 గంటలనుంచి తెల్లవారు జామున 2 గంటలదాకా ఆడుతూనే ఉండేవాళ్లం. కాని మా నాన్న నా చదువు వెనక బడకుండా రోజూ తీరిక సమయాలలో ప్రయివేటు మాస్టారుని పెట్టి బాగా పాఠాలు నేర్పించేవాడు

నేనూ, మా అమ్మా మా నాన్నతోబాటు క్లబ్బుకి వెళ్లేవాళ్లం అక్కడ మాకు— ఉచితంగా—భోజనం పెట్టేవారు. అప్పటికి ఇదే మాకు పెద్ద గొప్పగా అనిపించేది. సాయంత్రం నాట్య ప్రదర్శన అవగానే నన్ను ఒక గదిలోకి పంపించి, భద్రంగా బయట తాళంవేసేవారు మళ్లీ 12—30 కి బయటికి రానిచ్చేవారు. 2—00 గంటలకి ఇంటికి తిరిగి వచ్చేసేవాళ్లం.

## ప్రతిబంధకాలు

ఇలా ఒక ఏడాది గడిచింది మాకు వచ్చిన పేరు పురస్కరించుకుని మరోచోట ప్రదర్శిద్దామనుకున్నాము 'కాలియంటే' అనే చోటుకి వెళ్లాము. అక్కడ మా ప్రేక్షకులలో గారీకూపర్, లూపె వెలెజ్ ఉండేవారు మానాన్న నా విషయంలో మరింత శ్రద్ధ తీసుకునేవాడు. ముఖానికి మేకప్ రంగంమీదనే కాని విడిగా వప్పుకునేవాడుకాదు. అబ్బాయిలతో షికార్లు పనికిరావని నిషేధించాడు.

రోజూ పాఠాలతో, చదువుతో నాకు నా ఈడువారితో ఉండవలసినంత సావాసం దొరకలేదేమో అనుకుంటాను

'ఈ అభ్యాసం అంతా ఎందుకు?' అనిపించేది కొన్ని సమయాలలో. కాని నేను గడించే డబ్బు మా కుటుంబ పోషణకి సాయంచేస్తోందన్న తృప్తి ఉండేది. మా సహాయంతోనే మా తాతగారిని స్పెయిన్‌లోనుంచి అమెరికాకి రప్పించగలిగాము.

(సశేషం)

**రీటా హేవర్త్ ఒక తరం హాలీవుడ్ తారలలో అగ్రస్థానం అలంకరించింది. ఆమె ప్రణయ కథలు ఎందరినో కదల్చివేశాయి. ఆలీఖాన్‌తో ఆమె వివాహం ప్రపంచం అంతా సంచలనం కలిగించింది. అయిదు సంవత్సరాలు గొప్ప అయిశ్వర్యం అనుభవించింది. విడాకుల కోర్టులు తిరిగింది....**

**నేడు ఆమె తన కథ తనే చెబుతోంది....**

# అంతరిక్షంలో తేలడం ఎలా సాధ్యం?

డాక్టర్ మహీధర నళినీ మోహన్

“ఆకాశంలో తేలాలంటే” అనే పేరుతో 16—4—65వ తేదీ ఆంధ్రసచిత్రవారపత్రికలో ఒకరు వ్యాసం వ్రాశారు అందులో “మనిషి ఆకాశంలో ఎలా తేలగలిగేడు?” అన్న ప్రశ్న వేసి, “భూమ్యాకర్షణ శక్తి తక్కువగా ఉన్నంత ఎత్తులో అంతరిక్ష నౌక ఎగురుతూ ఉండడం చేత అక్కడ తేలగలిగాడు” అని వ్రాశారు

భూమిని వదిలి, కొన్నివందల మైళ్లు పైకి వెళితే అక్కడ భూమ్యాకర్షణ ఉండదనీ, లేక మనం గుర్తించలేనంత స్వల్పాతి స్వల్పంగా ఉంటుందనీ, అటువంటి చోట— గాలిలో దూది పింజెలా— తేలడం బహు సులువు అనీ చాలామంది అనుకుంటూ ఉంటారు

ఆ మధ్యని లోక్‌సభ సభ్యుడు ఒకాయన మా లేబరేటరికివచ్చి, “మీరు ప్రయోగించే యబోయే రాకెట్లు ఆర్బిట్ (Orbit) వరకూ వెళ్ళగలవా, లేక అంతఎత్తు దాకా వెళ్లకుండానే తిరిగి వచ్చేస్తాయా?” అని ప్రశ్నించారు “ఆర్బిట్” అంటే కక్ష్య (పిల్లి అంటే మార్జాలం అని చెప్పినట్లుగా లేదుకదా కొంపతీసి!) రాకెట్లు భూమి చుట్టూ ప్రదక్షిణాలు— చేసే మార్గాన్ని కక్ష్య అంటారు ఏదో ఇంత ఎత్తువరకూ రాకెట్లు ఎగిరితే అది ఆర్బిట్ అనే ఓ వలయాన్ని దొరకబుచ్చుకుని, భూమిచుట్టూ అనంతం ప్రదక్షిణాలు చేయగలదనీ, అంతఎత్తు దాకా ఎగిరే ఓపికలేని రాకెట్లు తిరిగి కిందపడి పోతాయనీ ఆయన ఉద్దేశం కావచ్చు

ఆ మధ్యని అంతరిక్షయానం మీద ఒక గ్రంథమే వెలువడింది అందులో భూమికి కొన్నివందల మైళ్ల దూరం వెడితే అక్కడ భూ చంద్రులు పోటీలు పడి, రాకెట్టుని ఎడాపెడా సమానంగా లాగడంచేత, (ఇద్దరు పెళ్లాల మొగుడిలాగ) రాకెట్లు ఇంధనం ఏమీ లేకుండానే భూ ప్రదక్షిణాలు చేస్తోందని వ్రాశారు రచయిత

ఈ తప్పుడు భావాన్ని సరిదిద్దవలసిన అవసరం కనిపించి ఈ వ్యాసం వ్రాస్తున్నాను

‘భార రహిత స్థితి” ఎల్లా కలుగుతుందో తెలుసుకునే ముందు రెండు ముఖ్య విషయాలు అర్థంచేసుకోవాలి

**ఒకటి** —విశ్వంలోని ప్రతి వస్తువుకీ ఇతర వస్తువులను ఆకర్షించే ధర్మం ఉంది సూర్యుడు గ్రహాలను ఆకర్షిస్తే, గ్రహాలు సూర్యుడినీ ఆకర్షిస్తాయి భూమి మనిషిని ఆకర్షిస్తే, మనిషి భూమినీ ఆకర్షించగలడు కాని, అనుభవంలో చెట్టుమీద నుంచి కాలు జారితే మనిషి కింద పడడమే కనిపిస్తోంది కాని, భూమి పైకి ఎగిరి రావడం కనబడడంలేదు దీనికి కారణం మనిషిలోకన్నా భూమిలోని ద్రవ్యం కోటానుకోట్లరెట్లు అధికం (భూమిలోని ద్రవ్యం 600000000000000 కోట్ల టన్నులు!)

వస్తువులోని ద్రవ్యం అధికమైనకొద్దీ వాటి మధ్య ఆకర్షణ హెచ్చుతుంది వాటి మధ్య దూరం హెచ్చినకొద్దీ ఈ ఆకర్షణశక్తి తగ్గిపోతుంది భూమిని విడిచి దూరం (పైకి) వెళ్ళినకొద్దీ ఆకర్షణశక్తి తగ్గిపోతుంది నిజమే కాని, అనంత దూరం వెడితే తప్ప ఆశక్తి సున్నకి సమానం కాదు

భూమిమీద ఆకర్షణశక్తి మాటవరసకి 100 అనుకుందాం వందమైళ్ల ఎత్తున ఆ శక్తి 95% ఉంటుంది 400 మైళ్ల ఎత్తున 82 5%, వెయ్యి మైళ్ల ఎత్తున 64%, పదివేల మైళ్ల ఎత్తున 8 2%, చంద్రుడు తిరిగేటంత దూరములో (సుమారు 2,40,000 మైళ్ళు) 0 00014%, కోటి మైళ్ళ దూరంలో 0 000016%, ఉంటుంది

మామూలుగా అంతరిక్ష నౌకలు 100—400 మైళ్ల మధ్యని ప్రదక్షిణాలు చేస్తున్నాయి అక్కడ భూమ్యాకర్షణశక్తి బొత్తిగా శూన్యమై పోతుందనడం సరికాదని చెప్పడానికే ఈ అంకెలు చంద్రుడు తిరిగే కక్ష్య దగ్గర ఈ శక్తి స్వల్పమే కాని, శూన్యం మాత్రం కాదు అసలే లేకపోతే చంద్రుడు భూమిచుట్టూ తిరుగకనే పోను

**రెండు** —పసిపిల్లల ఊయల మంచాలకు పైన గిరగిరా తిరిగే ప్లాస్టిక్ బొమ్మలు కడుతూ ఉంటారు. “కీ” ఇచ్చి వదులుతే గిరగిర తిరగడంలో కిందికి వేళ్లాడే ఆ బొమ్మలు పక్కలకు ఎగురుతాయి తిరిగే విసురు తగ్గితే బొమ్మల్ని మెల్లిమెల్లిగా యథాస్థానానికి వస్తాయి పల్లెటూళ్లల్లో తీర్థాలకు తెచ్చే రంగులరాట్నంలోనూ ఇదే పద్ధతి రాట్నం గబగబా తిరిగినంతసేపూ జంతువుల బొమ్మలన్నీ పక్కలకు ఎగురుతాయి రాతికి తాడుకట్టి గిరగిరా తిప్పుతే, తాడు బిగిసినట్లు తెలుస్తుంది వీటన్నిటికీ ఒకటే సామాన్య సూత్రం వక్రమార్గంలో ప్రయాణంచేసే ప్రతి వస్తువుమీదా ఒక శక్తి పనిచేస్తూ ఉంటుంది. ఆ శక్తి వస్తువును ఆ వక్రమార్గపు కేంద్రం నుంచి దూరంగా తోసివేస్తూ ఉంటుంది కనుక, దీనిని “వికేంద్ర శక్తి” అని పిలువవచ్చు ఆ వస్తువుకి మరే యితర ఆధారమూ లేకపోతే కేంద్రం నుంచి దూరంగా వెళ్లి పడుతుంది పై ఉదాహరణలలో రాయి గుండ్రంగా ప్రయాణం చేయడం వల్ల వికేంద్ర శక్తి దానిని తోసివేయడానికి ప్రయత్నిస్తుంది అది దూరంగా పోకుండా సరిగ్గా దానికి సమాన శక్తితో తాడు ద్వారా నువ్వు రాతిని కేంద్రంవైపు లాగుతున్నావు తాడు వదిలేస్తే రాయి అంతదూరం వెళ్లి పడుతుంది. రంగులరాట్నంలోనూ ఇదే సూత్రం భూమ్యాకర్షణ కిందికి లాగుతుంది వికేంద్ర శక్తి దూరంగా తోస్తుంది ఈ రెంటిలో దేని బలం అధికమైతే మొగ్గు అటువైపు ఉంటుంది మలుపు తిరిగేటప్పుడు సైకిలుమీద ప్రయాణం చేసేవాడు వక్రమార్గపు కేంద్రం వైపుగా వంగడానికి కారణం ఈ వికేంద్రశక్తిని ఎదిరించి, దూరంగా పడిపోకుండా ఉండడానికే బస్సు మలుపు తిరిగినప్పుడు ఇది ప్రతివారికీ అనుభవమే రైలు ఇంజన్లలో బోయిలర్‌లోపల ఆవిరి వత్తిడిని అదుపులో ఉంచే “గవర్నరు” సరిగ్గా ఈ సిద్ధాంతం మీదనే పనిచేస్తోంది



పాలవెల్లి





... అర్థం అయితే అంతరిక్షంలో తేలడం ఎలా సాధ్యమో గ్రహించడం కష్టంకాదు.

రాకెట్టు నిట్టనిలువుగా కొంత ఎత్తు ఎగిరి, నేలబారుగా వంగి, గంటకు సుమారు 18,000 మైళ్ల వేగంతో ప్రయాణం చేస్తుంది. ఇప్పుడు ఈ రాకెట్టుమీద రెండు శక్తులు పనిచేస్తున్నాయి. ఒకటి భూమ్యాకర్షణశక్తి. అది రాకెట్టును తన కేంద్రంవైపు లాగుకోడానికి ప్రయత్నిస్తుంది. రెండవది వికేంద్రశక్తి. వక్రమార్గంలో రాకెట్టు ప్రయాణం చేస్తూ ఉండడంచేత, ఆవర్తుల కేంద్రం నుంచి దూరంగా రాకెట్టును విసిరివేయాలని ఈ శక్తి ప్రయత్నిస్తుంది. భూమ్యాకర్షణశక్తి అధికమైతే రాకెట్టు భూమిమీద పడిపోతుంది. వికేంద్రశక్తి అధికమైతే అది భూమియొక్క ధృతరాష్ట్ర కౌగిలినుంచి తప్పించుకుని అంతరిక్షంలోకి దాటుకుపోతుంది. ఈ రెండు శక్తులూ సరి సమానమైతే భూమిమీద పడక, దూరంగానూ పోక, భూమిచుట్టూ ప్రదక్షిణాలు చేస్తుంది. అంటే రాకెట్టు 'ఆర్బిట్'' లో పడాలంటే ఈ రెండు పరస్పర వ్యతిరేకశక్తులూ సరిసమానం కావాలన్నమాట. ఇంత ఎత్తున ప్రదక్షిణాలు చేయాలంటే ఇంత వేగంగా ప్రయాణం చేసితీరాలని లెక్కలు కట్టవచ్చు. కష్టమేమీ కాదు.

భూమిచుట్టూ ప్రదక్షిణాలు చేసే అంతరిక్ష నౌకలో ఏ వస్తువుకీ బరువు అనేది ఉండదు. వస్తువులన్నీ అంతరిక్షంలో తేలియాడుతూన్నట్టుంటాయి. దీనికి కారణం ఆ ప్రదేశంలో భూమ్యాకర్షణశక్తి శూన్యం అవడం కానేకాదు. భూమ్యాకర్షణ లేకపోతే అంతరిక్షనౌక ఆ ప్రదక్షిణాలు చేయనేలేదు.

భారరహిత స్థితికి కారణం తెలుసుకునేముందు అసలు బరువు అంటే ఏమిటో తెలుసుకుందాం.

భూమిమీద ఉన్న ప్రతి వస్తువునూ భూమి తన కేంద్రంవైపు ఆకర్షిస్తోంది. వస్తువులోని ద్రవ్యం అధికమైనకొద్దీ ఈ శక్తి అధికమౌతుంది. ఒక వస్తువును నేలమీద పడకుండా చేతితో ఎత్తి పట్టుకోవాలంటే భూమ్యాకర్షణశక్తికి సమానమైన శక్తిని ఉపయోగించి పట్టుకోవాలి. ఆ వస్తువు మన చేతిని కిందికి నొక్కేస్తూ ఉంటుంది. దానినే బరువు అని అంటున్నాం.

కక్ష్యలో ప్రదక్షిణాలు చేస్తూ ఉన్నప్పుడు భూమ్యాకర్షణశక్తి ఒకవైపున, సరిగ్గా దానికి సమానమైన వికేంద్ర శక్తి మరోవైపున పని చేస్తూ ఉంటాయి. ఆ రెండు శక్తులూ ఒకదాని కొకటి చెల్లు. బరువు అనే భావనను కలిగించే భూమ్యాకర్షణకే చెల్లు పెట్టినప్పుడు ఇక బరువు ప్రసక్తి లేదు.

ఈ భారరహిత స్థితి ఎట్లా ఉంటుందో చూడడానికి అంతరిక్షయానమే చేయనక్కరలేదు. ఊయల ఊగుతూ పైనుంచి కిందికి వచ్చేటప్పుడు కొంతవరకూ ఇది అనుభూతమవుతుంది. ఎత్తయిన చోటునుంచి నీటిలోకి ఉరికితే భార రహితస్థితి తెలుస్తుంది. శరీరపు సాంద్రతతో సరిసమానమైన చిక్కదనం ఉన్న ద్రవంలో పడుకుంటే బరువులేకపోవడం అంటే ఏమిటో కొంతవరకూ అర్థం అవుతుంది. ★






చలం, నేను ఇంజనీరింగ్ కాలేజీలో ఒక్క సారే చేరాము కాని ఫైనలియరు వరకూ మా స్నేహం పెద్ద చెప్పుకోదగ్గదిగాలేదు. చివరి ఏడాది నెలరోజులు టూర్‌కి వెళ్ళినప్పుడు మేము ద్వరం ఒకే పెట్టెలో గడిపాము ఇబ్బంది పడకుండా మా ప్రొఫెసర్‌గారే రైల్వేవారితో మా కోసం ప్రత్యేకం ఒక బోగి రాసు పోసూ మాట్లాడారు మా పెట్టెలో ప్రతీ విద్యార్థి తలో బర్తు తీసుకోగా చలం మిగిలిపోయాడు బోగీలోఉన్న వాళ్ళు పెట్టెల్లో ఎక్కడా అతనికి బర్తు దొరకలేదు అతనువెళ్ళి ప్రొఫెసరుగారితో తన బాధ చెప్పుకున్నాడు ఆయన చలాన్ని తీసుకువచ్చి నాతో "శర్మా నీ భోషాణప్పెట్టెమీద చలం సరిపోతా ననుకుంటాను దానిమీద పడుకోనీ" అన్నారు అయితే మా ప్రొఫెసరుగారికి నా పెట్టె సంగతి ఎలా తెలిసిందా అని మీరు ఆశ్చర్యపోవచ్చును మా నాన్నగారికి నా అజాగ్రత్తమీద నమ్మకం ఎక్కువ అందుకని ఇంట్లో మా తాతలనాటి భోషాణానికి రంగులు వేయించి దేవుడి గుళ్ళో గర్భగుడికివేసే అంత పెద్ద తాళంవేసి ఆమాత్రం పెట్టెఉంటే దొంగలంతా సులభంగా ఎత్తుకుపోలేరని చెప్పారు మా మామ్మ దానినిండుగా నేతిక సరిపోయేటట్టుగా సున్నుండలు, చెక్కలూ పెట్టింది మా ఇంట్లో ఎవరిమాట వాళ్ళదే. రెండోవాళ్ళమాట వినిపించుకోరు మా అమ్మ మా ప్రొఫెసరుగారింటికివెళ్ళి ప్రొపర్ ఛానల్‌తో "మా అబ్బాయి చిన్నవాడు దారితప్పి పోకుండా చూసుకోమని చెప్పండి వాడికి వేళ్ళాగాని టిఫిన్ తినడం కూడా తెలియదు వాడి ఆకలి విషయం కూడా ఇంకోళ్ళు చెప్పాల్సిందే నెలరోజులంటే ఏమిటోగాఉంది" అంటూ కళ్ళనీళ్ళు పెట్టుకొందిట ఇది చాలనట్టు మా నాన్నగారు స్టేషన్‌కి వచ్చి నన్నూ, నా భోషాణాన్ని నా స్నేహితులకి పేరు పేరునా అప్పజెప్పి మా ప్రొఫెసర్‌గారికి ప్రత్యేకంగా అప్పచెప్పారు ఆవిధంగా మా ప్రొఫెసరుగారి దృష్టిలో నా పెట్టె తేబడింది పైగా చలం సరిగ్గా అయిదడుగులు ఉంటాడు. తను వాతి రోజుల్లో ఎప్పుడూ తను అయిదడుగుల ఒకటిన్నర అంగుళాలని, ఆ ఒకటిన్నర సంగతి నేను మర్చిపోతే నా జట్టుండదని అనేవాడు. పొడుగు అంతమాత్రం ఉండి బొద్దుగా, గుండ్రంగా వాళ్ళమ్మమ్మగారి దృష్టిలో ముద్దొస్తూ ఉండేవాడు (ఒకే కూతురవటంచేత పిల్లల దగ్గరే ఉంటోందిట) ఏదైతేనేం నా పెట్టెమీద చలం చక్కగా ఇమిడికగా కొంచెం కాళ్ళు ముడుచుకుని పడుకునేవాడు.

మొదటిసారి అతని స్వభావం నాకు బాగ అర్థమైంది, ఆనెలలోనే మేమంతా ఏదైనా స్టేషన్ రాగానే గబ గబా దిగిపోయి ఆడవాళ్ళ పెట్టెలవేపు పరిగెత్తి అందులో మాకు నచ్చిన అమ్మాయిలకి ఒకటో ఆరో పోజులుకొట్టి గార్డు ఈలవేసేసరికి మా బోగి ఎక్కేసేవాళ్ళం ఇంట్లో అమ్మా నాన్నా ఎదురుగా చదవటానికి భయపడే పుస్తకాలు కొని బాహాటంగా చదివే వాళ్ళం ఇంతమంది ఇంత విజృంభిస్తున్నా చలం మారలేదు భోజనానికి స్నానాదికాలకి తప్ప పడుకున్నవాడు లేచేవాడుకాదు నా పెట్టె తెరవటానికి అడ్డంగా ఎప్పుడూ దానిమీద పాల సముద్రముపై శేషసాయిలా చలం ఉండేవాడు. పైగా ఎంత బద్ధకస్తుడంటే తన మాసిన బట్టలన్నీ నా బెడ్డింగుమీద పారేసేవాడు "ఏమిటయ్యా ఇది ఇంత దురలవాట్లు నీకు" అంటే "మీరు కట్టినపాటి డబ్బు నేనూ కట్టాను మీరందరూ రాజుల్లా పడుకున్నారు నేనేమో ఇలా బాధ పడుతున్నాను పైగా నాకున్న నీట్‌నెస్ అసలు మా ఇంట్లో ఎవరికీలేదు" అన్నాడు

అటువంటివాడితో వాదనేమిటని మేమే అతని బట్టలు అవీ సర్దేవాళ్ళం మేము ఉత్తరదేశంలో తిరిగినంత కాలం టూర్ని, ఆదేశాన్ని పూర్తిగా అసహ్యించుకుంటూనే ఉన్నాడు మేమంత టూర్‌తో చాలా సరదాగా తిరిగాము రక రకాల డాన్స్‌, రెండు హార్బర్లు, డాక్కు చాలా [illegible] చూసాము. ఇవేవి అతనికి నచ్చినట్టు కనపడలేదు ఉండబట్టలేక ఒకరోజు అతన్ని "ఎందుకు నీకీ అసంతృప్తి?" అని అడిగాను

"ఇది మనుష్యులుండే దేశమేనా?" అని ఎదురు ప్రశ్నించాడు

"మరి వీళ్ళంతా ఎవరు?" అన్నాను అర్థం కాక

"వీళ్ళంతా మనుష్యులని నాకు నమ్మకంలేదు"

వాళ్లే మనుష్యులైతే ఇక్కడ ఇడ్లీలు దొరకాలి”
అన్నాడు.

అతని దృష్టిలో మనుష్యుల్ని గుర్తించే విధానం ఇడ్లీలు తినడముమీద ఆధారపడి ఉండాలన్నమాట అదే కొందరు వాళ్ల వూరు విద్యార్థులతోఅంటే అతనికి ఇడ్లీలంటే చాలా ఇష్టమని పుట్టింట్లో ఉన్నన్నాళ్లు వాళ్ల అమ్మమ్మగారు రోజూ చేసి పెట్టే వారని హాస్టల్లో కూడా ఇడ్లీలు ఇవ్వని రోజు అతను చిరాకుగా ఉంటాడని చెప్పారు నా కప్పు డనిపించింది ఇడ్లీలను చలం ప్రేమించినంతగా ఎవరూ ప్రేమించలేరని లేక చలం ఇడ్లీలను ప్రేమించినంతగా దేన్ని ప్రేమించలేడని

ఆయితే కథ అక్కడితో ఆగినా బావుండును చలానికి నాకు బి యి లో ఫస్టుక్లాసు రావటం చేత ఖరగ్‌పూర్ ఐ ఐ టి లో మాకు ఎమ్. టెక్‌లో సీటు వచ్చింది ఆ ఏటినుండి పైగా మన ప్రభుత్వము ఇంజినీరింగ్‌లో పోస్టు గ్రాడ్యుయేటు చేసేవాళ్లందరికి నెలకి రెండువందల యాభై



రూపాయలు ముట్టచెప్పదలుచుకున్నట్టుగా ప్రకటించింది. ఎల్లాగో ఇంకే ఉద్యోగమైనా అంతకంటే ఎక్కువరాదు కనుక ఖరగ్‌పూర్ వెళ్లాం. అక్కడ గోఖలే హాల్‌లో మాకు పక్క పక్క రూమ్సు ఇచ్చారు దాంతో మా స్నేహం పెరిగిపోయింది

ఖరగ్‌పూర్ గురించి ఒక్కముక్కలో చెప్పా లంటే అదో మహారణ్యం మెస్‌లో ప్రతిపూట బంగాళదుంపల కూరే మరేదైనా కూరగాయలు వండినా అవి బంగాళ దుంపలతో కలిపి వండటం చేత ముక్కల్లో చంద్రుడిలాగా ఉంటాయి పోనీ ఆ కూరైనా రుచిగా ఉంటుందా అంటే అదీ లేదు అక్కడ చాలాకాలంగా ఉన్నవాళ్లు “ఆ వూర్లో పూర్వం రిక్షా లాగుతున్న వాళ్లలో కొందరు ఐ ఐ టి పెట్టగానే వంటగాళ్లుగా చేరిపోయారు” అని చెప్తారు అది నిజమనిపించేది ఎగానికి సగం రోజులు భోజనం మానేసి ఏ పాలో తాగి పడుకునే వాళ్ళం

అల్లాంటి వూళ్లో మూడోరోజుకల్లా ఎండి పోయిన తోటకూర కాడలా అయిపోయాడు చలం వాళ్లమ్మమ్మగారు రోజూ గుర్తుకు రావట మొదలుపెట్టారు. అయినా ధీరోదాత్తుడు కనుక ఇన్‌స్టిట్యూట్‌కి ఒక మైలు దూరంలో నాయరు కాంటీను ఉందన్న సమాచారం సేకరించాడు ఆరోజు సాయంత్రం అయ్యేసరికి పండులా తయారయివచ్చి నన్ను తయారు కమన్నాడు. ఇంత బద్ధకాలరావు “రాముడు పెందలకడే లేచును” అంత బుద్ధిమంతుడైపోయాడే అని ఆశ్చర్యపోయాను “ఎందుకని” అడిగాను “నాయరు కాంటీనుకు” పోదాం అన్నాడు ఈ హాస్టలు భోజనపు ముచ్చట తీరటంవల్ల పరేసని బయల్దేరాను

“ఏమున్నాయి” అని అడిగాము

“ఇడ్లీ, వడ, దోశ” అన్నాడు నాయరు తెలుగులో

“అయితే నాలుగు, నాలుగు ఇడ్లీలు పట్రా” అన్నాడు చలం

“అదేమిటోయి సాయంత్రము ఏడుగంటలైంది ఇడ్లీలు చెయ్యటానికి నాయరుకు బుద్ధి లేకపోతే తినడానికి మనకైనా ఉండద్దా అందులోనూ నాలుగా!” అన్నాను నా ఉద్దేశంలో ఇడ్లీలు పొద్దుటవేళ తినదగ్గ ఫలహారము అని

“ఏడ్చావు! భగవన్నామస్మరణకి, ఇడ్లీలు తిన టానికి వేళా పాళ లేమిటోయి” అని కసిరాడు చలం

అది మొదలు మేము బయటికివెళ్తే ఇడ్లీలు తినాల్సిందే ఎప్పుడైనా రాత్రివేళ భోంచేసి అల్లా షికారుకు వెళ్లేవాళ్లం రెండు “హాల్వేరు పాక్” (ఆ వూళ్లో మిఠాయి కిళ్లీ పేరు) లు కొనుక్కుని “తినేవాళ్లం” చలం భాషలో మొదట్లో నేను ఎంతో “కిళ్లీ తినడమేమిటోయి! కిళ్లీ వేసు కోడం అనాలి” అనేవాడిని దాంతో అతను చర్రుమ లేచేవాడు

“ఇక్కడున్న బెంగాలీవాళ్లు, ఒడ్డివాళ్లు కాఫీ, టీ లు తినగా లేంది మనం ఘన పదార్థం కిళ్లీ తినడంలో తప్పేమిటి” అనేవాడు నిజమే బెంగాలిలో మరి” అమిచాయి ఖావో” అనాలి

ఇదంతా ఎందుకు చెప్తున్నానంటే ఇడ్లీలు సరిగ్గా దొరకని కారణంచేత బంగాళదేశం అన్నా అందులోని మనుష్యులన్నా సానుభూతి లేకుండా పోయింది చలానికి ఆ వూళ్లోఉన్న ఒకటిన్నర హోటళ్లు ఎప్పుడోకాని ఇడ్లీలు వెయ్యవు అతన్ని సినిమాకి తయారు చెయ్యటం మరో పెద్ద ప్రయత్నం అతను బట్టలు వేసుకుని, తల దువ్వుకుని పౌడరు రాసుకునేసరికి తెల్లారిపోయేది. పైగా ఆ వూళ్లో మొదటి ఆట అయిదున్నరకే మొదలు— “ఏమోయి ఇంత ఆలస్యం చేస్తావు” అంటే

“రేపు నీకు పెళ్లయితే నీ భార్యారత్నం ఎలాగో ఆలస్యం చేస్తుంది దానికి నేను ట్రెయినింగు ఇస్తున్నాను” అనేవాడు “పైగా ఈ వూళ్లో మనం చూసేవి సినిమాలనకు ఉన్న మూడు సినిమా హాల్సులోనూ సినిమా చూసేది తక్కువ. వల్ల ఆ పెట ఎక్కువ ఆలస్యం అయినా పరవాలేదు” అని కేకలు వేసేవాడు అందుకని ఫలానా హోటల్లో ఆరోజు ఇడ్లీలు చేస్తారని త్వరగా వెళ్లకపోతే అయిపోతాయని హడావిడి చేసేవాడిని. అది వెంటనే పని చేసేది ఆదరా బాదరా తయారైపోయే వాడు ఆరోజు నా ఖర్మకాలి ఆ హోటలువాడు ఇడ్లీలు వెయ్యకపోతే చలం తిట్టే తిట్లు “ఎందుకు చేసావురా భగవంతుడా ఈ తప్పు” అనిపించేలా చేసేవి

అందుకని అతని దృష్టి ఇడ్లీలమీదనుంచి దేని మీదకైనా మళ్లించాలనిపించింది మామూలుగా ఆ వయసు అబ్బాయిలు అమ్మాయిలంటే ఇష్ట పడతారుకదా అని “ఈ బెంగాలీ అమ్మాయిలు రసగుల్లాల్లా ఉంటారు కదోయి!” అన్నాను

“ఏమీ ఉండరు బెంగాలీ వాళ్లందరిని గిరి గీసి నల్ల బెంగాలీలు తెల్ల బెంగాలీలు అని విడదీయవచ్చు నల్లవాళ్లు బొగ్గుల్లా ఉంటారు. ఆ తెల్లవాళ్లు మంగోలియన్సు తెగకి చెందినవాళ్లు. వాళ్ల నక్లస్ చూస్తే తెలుస్తుంది పైగా వీళ్లకి రవీంద్ర సంగీతంతప్ప సంగీతము కాదని, తమ సంస్కృతితప్ప ఏదీ నిజమైన సంస్కృతి కాదని నమ్మకం త్యాగరాజెవరని అడుగు మాటికి తొంభై మందికి తెలియదు నేను చదువుకోని వాళ్లమాట



# చలం ఇడ్లీలు

చదువుకున్న వాళ్లవెంట వెళ్లి వాళ్లు ఇళర్ల గురించి తెలుసుకోడానికి ప్రయత్నం కూడా చెయ్యరు ఇంత సుపీరియారిటీ కాంప్లెక్సు ఉన్నవాళ్లంటే నాకు అసహ్యం" అన్నాడు బెంగాలీలను కాచి వడపోసినట్టు

అయినా నా ప్రయత్నాలు మానలేదు నా ప్రేమో దంతాల్ని చిలవలు పలవలుచేసి పెంచి వూరిస్తూ చెప్పేవాడిని పైగా పదిహేడో నంబరుకు (మా మేనమామ కూతురు— ఈవిడ్ని చేసుకోకపోతే మా నాన్నగారు చెవి మెలేస్తారని చెప్పేరు ఎలాగో తప్పనప్పుడు రొమాన్స్ పోగొట్టుకోడం ఇష్టంలేక) ప్రేమలేఖలు వ్రాస్తే అతనికి జదివి వినిపించే వాడిని దాంతో కొన్నాళ్లకి చలానికి ప్రేమమీద ఆసక్తి పుట్టింది ప్రతి శనివారం ఇన్స్టిట్యూట్‌లో సినిమాలు చూపిస్తారు నెలకి ఒకటో రెండో రూపాయలు కడ్తే ఆ ఎడారి జీవితంలో ఆరోజే కొన్ని రంగులు కనిపిస్తాయి అక్కడికి తీసుకు వెళ్లి చలాన్ని తిప్పటం మొదలు పెట్టాను

చలం బాగ మారాడనుకున్న తరువాత ఒక శనివారం "ఆ అమ్మాయి బావుందికదోయ్"అన్నాను నాకు నచ్చిన హో ముద్దబంతి పువ్వుని చూపిస్తూ

"అదేం అందమోయ్! నీ టేస్టు ఇంత పాడను కోలేదు చక్కగా బాపు బొమ్మలాగా స్లిమ్ అండ్ టాల్‌గా ఉండలి" అన్నాడు

నా అభిరుచి బాగా లేదన్నందుకు బాధ పడినా అతని మనస్సు కస్త ఆడపిల్లల అందమువైపు మొగ్గినందుకు సంతోషించాను అతని హృద యంలో ఇడ్లీలతోపాటు బాపు బొమ్మలాంటి అమ్మాయిలకు కాస్త చోటిచ్చాడు

చదువు పూర్తయ్యాక మా స్వంత వూరు విశాఖపట్నంలోనే లెక్చరర్ ఉద్యోగం అవడంచేత మావామ్మగారి తొందరవల్ల నా పదిహేడవ నంబరుతో పెళ్లైపోయింది కొన్నాళ్లకి పెళ్లి, ఉద్యోగం రెండులేని చలం మా ఇంటికి వచ్చాడు "శర్మను చూసైనా బుద్ధి తెచ్చుకో అని ఇంట్లో నాన్న గారు కేకలు వేస్తున్నారు నా కింకా ఇరవై అయినా నిండలేదని పెళ్లికి తొందర లేదని మా అమ్మమ్మ గారు అంటున్నారు ఆవిడ దృష్టిలో మూడేళ్ల క్రితం నా వయస్సు పందొమ్మిదేళ్లు ఇప్పుడు ఇరవై అంటే ఆవిడ టైము స్కేలులో ఒక సంవత్సరం మూడు సంవత్సరాలకి సమానం ఆవిడ అరగంటలో వంట చేస్తానందంటే ఆరోజు మనం హోటల్లో భోంచెయ్యడం నయం" అని వాపోయాడు

అతనున్నన్నాళ్లు మేము ముగ్గురం సరదాగా తిరిగాము చివరి రోజున నా శ్రీమతి "ఏమండీ మీరు గూడా ఎందుకు ... చేసుకోరు" అని అడిగింది

"నా కింకా ఉద్యోగం సద్యోగంలేదు నాకు పిల్లనిచ్చేవాళ్లు లేరని అయినా కొంతకాలం ప్రేమించి హాయిగా చెట్టాపట్టాలు వేసుకుని డ్యూయెట్లు పాడుకుంటూ ఏ సాతునూర్ డామ్ దగ్గరో బోటు షికారు చెయ్యకుండా పెళ్లేమి టండీ" అని నవ్వేసాడు

కాని అతను మా ఆవిడ మాటలు నవ్వేసినంత తేలికగా తీసుకోలేదని తరువాత తెలిసింది వరం గల్లునుంచి "నా కీ వరంగల్లులో ఉద్యోగం అయింది ఇక్కడి భోజనము రుచి చూసాక, మీ అన్యోన్య దాంపత్యం చూసాక పెళ్లి ముందు జరిపి చెట్టా పట్టాలు, డూయెట్లు, బోటు షికార్లు వాయిదా వేస్తున్నాను ఎవరినైనా మంచి అమ్మాయిని చూడమని మా వాళ్లకి వ్రాస్తున్నాను" అంటూ ఉత్తరం వ్రాసాడు

మరో రెండు నెలలయేసరికి చలం తను తల్లి దండ్రులతో సహా విశాఖపట్నం వస్తున్నానని ఉత్తరం వ్రాసాడు అనుకున్న రోజున స్టేషన్‌కు వెళ్లి వాళ్లని మా ఇంటికి తీసుకువచ్చాను వాళ్లు ఆ వూరికి కొత్తగా వచ్చిన సత్యనారాయణగారనే ఇన్‌కమ్‌టాక్సు ఆఫీసరుగారి అమ్మాయిని చూడ్డా నికి వచ్చారుట మమ్మల్ని రమ్మన్నారు చూడ్డానికి అమ్మాయి కళగా బాగుంది చదువుకుందిట బాగా పాడుతుంది చలం తలిదండ్రులు ఆ అమ్మాయి చలానికి నచ్చితీరుతుందన్న నమ్మకంతో ఉన్నారు కాని నాకు కొంచెం ఆ అమ్మాయి బాపు బొమ్మల

అర్డరు చేసాను ఇడ్లీ మాట వినగానే మొహంలో చిటపటలు తగ్గించాడు అవి తినడం మొదలు పెట్టాక పూర్తిగా ప్రసన్నుడయ్యాడు. "వత్సా నీకే వరం కావాలో కోరుకో" అనే ధోరణిలో

మెల్లిగా "అంత లక్షణమైన అమ్మాయి నీకు నచ్చకపోవటమేమిటోయ్!" అన్నాను జవాబు తెలిసే ఉన్నా

"నేను చేసుకోబోయే అమ్మాయి బాపు బొమ్మలా ఉండాలి" అన్నాడు చలం

బాపుమీద కోపం వచ్చింది నాకు ఎప్పుడో నూటి కొకళ్లుకాని కనిపించనంత అందంగా ఎడుచు అమ్మాయి బొమ్మలు గీసేసి యువ ప్రపంచంమీదికి శర పరంపరగా వదిలేయడంచేత చాలామంది పడుచు అబ్బాయిలు మతులు పోగొట్టు కుని అల్లాంటి పెళ్లి కూతుళ్లే కావాలనటం దాని వల్ల చాలామంది కన్యలుగా ఉండిపోవలసి రావటం పాలియాండ్రీ నిషిద్ధమవడంచేత, తద్వారా అబ్బా



కన్నా రవివర్మ బొమ్మలకి దగ్గరగా ఉందేమో అన్న అనుమానం వేసింది

ఇంటికి రాగానే చలం "నా కా పిల్ల నచ్చలేదు" అన్నాడు పిడుగుపాటులా

"మా అందరికీ నచ్చిన పిల్ల నీ కెందుకు నచ్చలేదు?" అని అతని తండ్రి నిలదీసారు

"ఇంట్లో అందిరికీ నచ్చినా అమ్మచేసే వంకాయ కూర మీ కెందుకు నచ్చదు?" అని ఎదురు ప్రశ్న వేశాడు చలం

ఆయన పాపం దిగ్భ్రమ చెందాడు అప్పటికి ఏమీ అనలేక తరువాత నన్ను పిలిచి "సత్యనారా యణగారి సంబంధం మాకు చాలా కావలసింది. ఆయన తండ్రిగారు మా తండ్రిగారికి జన్మ జన్మలకు తీర్చుకోలేని ఉపకారం చేసారు ఇవన్నీ వీడికేం పట్టవు ఇప్పుడు ఆయన పిల్లనిస్తానంటే మనం కాదంటే ఏం బావుంటుంది. నువ్వైనా కాస్త వాడికి నచ్చచెప్పు నాయనా!" అని బ్రతి మాలుకున్నారు

"అలాగేనండీ" అని కాసేపటికి చలాన్ని బయలు దేరదీసి హోటలుకు తీసుకువెళ్లి ఇడ్లీలు

యిలు బడుద్ధాయిలుగా ఉండిపోడం అబ్బ ఎంత పెద్ద విషవలయం బాపు ఎందు కీ విషయం సమాజ క్షేమం దృష్ట్యా గుర్తించలేదో!

కాని చలాన్ని దారిలోకి తీసుకు రావాలంటే పద్ధతి వేరు అందుకని "చూడమ్మా! చలం నీకు ఇడ్లీలంటే చాలా ఇష్టం పీలగా ఉన్నమ్మాయిలు గట్టిగా నాలుగు వాయిలకు సరిపడే పిండైనా రుబ్బ లేరు బాపు బొమ్మలు పీలగా ఉంటాయి అందు చేత మేమంతా మా పెళ్లాలు చేసిన ఇడ్లీలు తింటూ ఉంటే నువ్వుమాత్రం హోటళ్లను పట్టు కుని ఆఘోరించాలి పైగా రబ్బరుతో బాపూ బొమ్మని చేసామనుకో దాంట్లోకి కొంచెం గాలి కొట్టామనుకో అప్పుడు ఆ బొమ్మ అందంగాను బలంగాను కనిపిస్తుంది అవునా ఆలోచించి చూడు సత్యనారాయణగారి అమ్మాయి కొంచెం గాలి కొట్టిన బాపూ రబ్బరు బొమ్మలా ఉండ దనా? ఆవిడ కనుక అయితే నీకు పైగా ఎప్పు డైనా మాలాంటివాళ్లు వస్తే మాకు కూడా చక చకా పిండి రుబ్బి ఇడ్లీలు చేస్తుంది. నేను చెప్పి నట్టు, అదే ఆ అమ్మాయి బాపు బొమ్మ బలంగా

బహుమతికైన లేబిల్ కొరకు ప్రతి టిన్నుమీద చూడండి.



## చల రాణి ఇడ్లీలు

ఉంటే ఎల్లా ఉంటుందో అల్లా ఉందో లేదో కావాలంటే మరోసారి చూసి తేల్చుకో" అని బోధ చేసాను.

**మరొకసారి ఆ అమ్మాయిని చూస్తే పోయే** దేమిటి అనుకున్నట్లున్నాడు, ఒప్పుకున్నాడు అందుచేత రాత్రికి రాత్రి సత్యనారాయణగారింటికి వెళ్ళి చలం రేపు మళ్ళీ అమ్మాయిని చూస్తాడని చెప్పి మర్నాడు వారు నడుచుకోవలసిన విధాన ముపదేశించి వచ్చాను

మర్నాడు మేము వెళ్ళేసరికి ఆయన సాదరంగా ఎదురువచ్చి లోపలికి తీసుకు వెళ్ళారు కాసేపటికి వారి అమ్మాయి ఆవిర్లుకక్కే దూదిపింజాల్లాంటి ఇడ్లీలు తీసుకు వచ్చింది చలం నేనూ అవి తింటూ ఉంటే సత్యనారాయణగారు "అసలు ఇడ్లీకంటే శ్రేష్ఠమైన పిండి వంటలేదు పూర్తిగా ఉడికించి వండటంవల్ల జబ్బులు చెయ్యవు అసలు ఉల్లి చేసిన మేలు తల్లి కూడా చెయ్యదు అంటారు. కాని నన్నడిగితే ఇడ్లీలు చేసిన మేలు తల్లి కూడా చెయ్యదు అని మార్చాలంటాను. అందుకని మా ఇంట్లో రోజూ ఇడ్లీలే తింటాము. మా అమ్మాయికి కూడా బాగా చెయ్యటం వచ్చును ఇవి మా అమ్మాయి చేసినవే" అని అనర్గళంగా ఉపన్యసిస్తూపోయాడు.

సత్యనారాయణగారివి తనవి ఒకే అభిప్రాయాలవటం చలానికి చాలా నచ్చింది అందుకని ఆయనవేపు గౌరవంగాను, ఇడ్లీలు తయారు చేసిన వారి అమ్మాయికేసి అభిమానంగాను చూసాడు. అదే అదునుగా చలాన్ని "ఎలా ఉంది?" అనడిగాను

"ఫస్టుగా ఉంది" అన్నాడు "ఇడ్లీలు తయారు చేసినవారు ఇడ్లీలంతా బాగున్నారు"

తరువాత ఓ శుభ ముహూర్తానికి చలం సత్యనారాయణగారికి అల్లుడయ్యాడు ఆ సందర్భంలో నేనో ఖరీదైన ఇడ్లీ పాత్ర బహూకరించాను. కాని ఎప్పుడైన ప్రణయంలో ఆదమరిచి అలవాటు కొద్దీ అభిమానం చూపబోయి భార్యను పొగుడుతున్నాననుకొని "ఇడ్లీలా ఉంటావు! రాణీ!" అంటాడేమో అన్న భయం నాకు ★






## వైజ్ఞానిక గాదాశతి

## 19

డాక్టర్

న్యూయార్కులోని రివర్సైడు చర్చి గోడలలో చెక్కిన ఆరువందల బొమ్మలలో వైజ్ఞానికుల బొమ్మలన్నీ గతించినవారివే ఒక్క అయిన్‌స్టీను బొమ్మమాత్రము ఆయన బ్రతికుండగానే చెక్కేరు ఆ చర్చిని నిర్మించినప్పుడు డాక్టరు హేరీ ఎమర్సను పెద్ద పెద్ద వైజ్ఞానికులకు వ్రాశాడు "విజ్ఞానశాస్త్ర చరిత్రలో పధ్నాలుగురు గొప్పవారి పేర్లు వ్రాయండి" అని అందరి లిస్టులలోనూ అయిన్‌స్టీను పేరుండినది!

ఆయన గొప్పకి కారణము ఆయన తెలివి తేటలు మాత్రమేకాదు నిరూపణలేని వూహాగానాలు నమ్మకపోడము కూడాను నీటి ఉపరితలము మీద తరంగములు వ్యాపిస్తాయి గాలిలో శబ్ద తరంగాలు వ్యాపిస్తాయి మేక్స్‌వెల్ విజ్ఞాని "వెలుతురంటే విద్యుదయస్కాంత తరంగములే"అన్నాడు తరంగములేకాని దేనిలో తరంగాలూ? అని ప్రశ్న పుట్టింది "ఈథరు అనే సర్వ వస్తు వ్యాపి పదార్థములో" అని జవాబు చెప్పుకున్నారు వైజ్ఞానికులు వెల్తురు తరంగాల్ని వ్యాపింపజేయాలంటే ఈ ఈథరు ఉక్కుకన్న ఎన్నోరెట్లు స్థితి స్థాపకత్వము (Elasticity) కలిగినదవాలి. సూర్యుని వెల్తుర్ని భూమికీ గ్రహాలకీ అందించడానికి ఈథరు సూర్యమండల మందంతటా నిండాలి, గాజూ నీరూ వంటి పారదర్శక (Transperent) పదార్థాలలో ఉండాలి, ఉక్కుకన్నా గొప్పదికావాలి ఇది ఎలాగ సాధ్యము? అన్న సందేహంతో ఆగిపోకుండా వైజ్ఞానికులు "వెల్తురు ఈథరులో తరంగాలుగా ప్రయాణిస్తుంది" అని నమ్మి ముందుకు పోయారు మైకెల్సను, మోర్లీ అన్న వైజ్ఞానికులు ఈథరులో భూమి సంవత్సర గమనాన్ని పట్టిచూపే ప్రయోగము చేశారు భూమి కదుల్తున్నట్లే తేలలేదు! దొంగకు తేలు కుట్టిన విధంగా వూరుకున్నారు ఎవరికి వారు అయిన్‌స్టీను "ఈథరేలేదు పొమ్మ"న్నాడు వూహించరాని ఈథరులో వెల్తురు సెకనుకు 1,86,000 మైళ్ళు పయనిస్తోందన్న అసందర్భపు నమ్మకాన్ని తొలగించి ఎవరు కొలిచినా వెల్తురు వేగము 1,86,000 మైళ్లే అన్న ప్రయోగ సత్యాన్ని ప్రకటించాడు వస్తు వేగాధిక్యతకి అవధి (Limit) ఉన్నదా? అని అడిగితే "విసిరేశక్తి ఉండాలిగాని వేగానికి అంతము ఏమిటి? అది అనంతము" అంటారు ఎవరేనా. అయిన్‌స్టీను వస్తు వేగానికి సెకనుకి 1,86,000 మైళ్ళు అవధి అని నిరూపించి, అనంతమన్నది వట్టిదని నిరూపించాడు

న్యూటను రెండు వస్తువుల నడుమ ఆకర్షణ ఉంటుందన్నాడు. "ఈ ఆకర్షణ్నే అవి ఒకదానివైపు మరొకటి మొగ్గుతూండడానికి కారణము" అన్నాడు మైదానంలో వ్రేలాడగట్టిన గుండు దారము లంబరేఖ (Vertical line) లో ఉంటుంది, కొండపక్కన వ్రేలాడదీస్తే గుండు కొండవైపు మొగ్గినట్టు కనపరుస్తుంది దారము అయితే దీనికి ఆకర్షణశక్తే కారణమని నిర్ధారణ ఎట్లా? అని అడిగితే జవాబులేదు న్యూటను అది శక్తి అనుకున్నాడు శక్తే అయితే గుండుకీ కొండకీ నడుమ ఇంకొక వస్తువు అడ్డువస్తే ఆ శక్తి మారాలి, మారలేదు "శక్తే అయితే ఎందుకు మారలేదు?" అన్న ప్రశ్నకి ఎవరూ సమాధానము చెప్పలేదు అయిన్‌స్టీను "అది శక్తి కానేకాదు" కొండ చుట్టూరావున్న అకాశములోని వంపు అన్నాడు కాలి బాటలలోని వంపువల్ల పధికుడు ఇటు చెట్టువైపూ అటు గుంటవైపూ మొగ్గినట్టు కానవస్తాడు దూరమునించి చూస్తే ఆ మొగ్గుకి కారణము ఆకర్షణకాదుగా? దారి వంపు కారణము. అలాగే ఖగోళాల చుట్టూరావున్న ఆకాశములో వంపులుంటాయని చెప్పి 'ఆ వంపు ఇంత' అని లెక్కగట్టి చూపించాడు అయిన్‌స్టీను.

భౌతిక శాస్త్రజ్ఞులు ప్రయోగశాలలలో ప్రయోగములు చేస్తారు అయిన్‌స్టీను తన మనోరంగంలో చేస్తాడు ప్రయోగాల్ని. ఆ ప్రయోగాలవల్ల ఎవరూ వూహించని ఫలితాల్ని పట్టి ప్రకటించాడు కూడాను ఎక్కడో ఆకాశాంతరాళంలో వృద్ధి అవుతూన్న వేగము (Acceleration) తో లాగబడే గదిలోని వైజ్ఞానికుల అనుభవమూ, భూమిమీద గదిలోని వైజ్ఞానికుల అనుభవమూ ఒకటేనట!, రాకెట్టులో సమవేగంతోపోయే వైజ్ఞానికులు తాము భూమివైపు నేరుగా నిరాధారంగా పడిపోతున్నారో లేక ఆకాశంలో ఎక్కడో స్థిరంగా ఉన్నారో, సమవేగంతో పోయే రాకెట్టులో ఉన్నారో తెలుసుకోలేరట! ఈ ప్రయోగాల్నిబట్టి వింత వింత తీర్మానాలు చేశాడు, విశ్వాంతరాళంలోని సత్యాల్ని పట్టి ప్రకటించాడు.

విశ్వములోని వైవిధ్యమును తగ్గించే దారిలో, సృష్టిలో సౌరళ్యాన్ని దర్శించే దారిలో శ్రమించాడు అయిన్‌స్టీను వస్తువూ శక్తీ (Matter and Energy) ఒకే తత్త్వపు రెండు రూపాలన్నాడు ఒకటి మరొకటిగా మారగలవన్నాడు. తరంగశీలము (Wave Nature) చూపే వెల్తురు గుళికాతత్వము (Quantum Aspect) ను కూడా చూపిస్తుందన్నాడు సృష్టి సూత్రాలు, స్థిరంగా ఉన్నవారికీ సమ వేగంతో ఋజురేఖలో గమించేవారికీ, వేగవృద్ధితో గమించేవారికీ సమాన రూపంతోనే వర్తిస్తాయన్నాడు విశ్వమంతా ఏకైక క్షేత్ర విస్తృతితో వెలిసిందంటు నిరూపించే యత్నంచేస్తూ కాలం చేశాడు భౌతిక శాస్త్రజ్ఞులలో ఇంతవరకూ అంత మేధావి పుట్టి ఉండలేదు. ★

## భారీయెత్తున దేశరక్షణకు
## ప్రణాళికాబద్ధమైన అభివృద్ధి అవసరం



# సంపెంగలూ సన్నజాజులూ




### జరిగిన కథ

మంజాల వివాహం అవుతుంది సహృదయం గల అన్నచెల్లెళ్ళని చదువుకోమని సలహా యిస్తాడు ఆరేళ్ళు గడిచేప్పటికి బి య్యే. పట్టాతో బాటు నాలు గేళ్ళ మధురిమను కూడా పొందుతుంది మంజ ఎం ఏ. పరీక్షకు బలవంతంచేసి భర్తని ఒప్పిస్తుంది. కానీ ఆమె పాసవుతుంది, భర్త ఫెయిలవుతాడు తనకు చదువు మీద శ్రద్ధ లేదని చెప్తాడు. మంజ అన్నయ్య సంసారం ఋంటువడుతుంది భర్తకు తెలీకుండా తన నగను అమ్మి అన్నయ్య అప్పును తీరుస్తుంది. భార్యా భర్తల మధ్య మనస్పర్ధలు చెలరేగుతాయి ఎం ఏ సెకండ్ క్లాస్‌లో పాసవుతుంది మంజ హరిగోపాల్‌తో చేరిన మంజాల భర్త ప్రవర్తన రోజురోజుకీ విపరీతంగా తయారౌతూఉంటుంది అన్నయ్యకు ప్రమాదంగా ఉందని తెలిసి భర్తకి చెప్పకుండా ప్రయాణ మవుతుంది మంజ అన్నయ్య ఆరోగ్యం పూర్తిగా పాడైపోతుంది కంటి చూపు కూడా దెబ్బతింటుంది పరిస్థితి తనచేయి దాటిపోయిందంటాడు డాక్టరు అతని సలహామీదనే మరో ప్రసిద్ధిపొందిన డాక్టరు వద్దకు తీసుకు వెడతారు ప్రసాదరావుని ప్రసాదరావు మరణంతో కృంగిపోయిన మంగళను, పిల్లలను ఊరడించి తన యింటికి తీసుకువస్తుంది మంజ.

## 22

మధుర దగ్గర్నుంచి ఉత్తరం వచ్చింది లోపల ఏదో కార్డులాటిది ఉన్నట్టు తోచి కవరు నెమ్మదిగా చింపేసేను. మధురా, ఆమె ప్రక్క నాటులో ఉన్న మరొక అందమైన యువకుడూ, కలిసి తీయించుకున్న ఫోటో అది నాకు ముచ్చెమటలు పోశాయి మరొక ప్రేమగాధ కిది ప్రస్తావనా ? లోపలున్న అందమైన అక్షరాలు చదివేదాకా నేను ఆగలేకపోయాను

మంజులా, మాన్యవతీ,

మా వివాహానికి మీరు వస్తారని, ఎంతగానో చూశాను సరైన ఎడ్రసుకే శుభలేఖ పంపేము మీరు జవాబేనా ఎందుకు రాయరో నాకు బోధ పడ్డంలేదు అందరూ కులాసాయే గదా ?

నేను ఆయనతో ఈ వూరు వచ్చి రెండు నెలలు అవుతుంది ఇది మావాళ్ళు కుదిర్చిన సంబంధమే ముందుగా నే వెళ్ళి చూడలేదు కూడా ఏదో పెద్దపని చేస్తున్నట్టు ఆఫీసుకి వెళ్ళి, గంటా రెండు గంటలూ దాటకుండా వచ్చేసి, నన్ను చూస్తూ కూచోడమే ఈయనగారి పని

పూర్తిగా విడిన ఎర్ర కలువలు గల మాయింటి ముంగిట కొలను చూసినా, నిరంతరం జలతరంగిణి వాయించే మా యింటి వెనక పిల్లకాలువ చూసినా మీరే జ్ఞాపకం వస్తారు మీరెలా ఉన్నారు ? నాతో పోటీకి వచ్చిన మీ మధురిమ ఎలా ఉంది ? ఫోటోలో నే నెలా ఉన్నాను ? తన భార్యని నేను కాదని లోకులెక్కడ అనుకుని పోతారో అని నా భుజంమీద చెయ్యివేసుకుని ఫోటో తీయించుకున్న మా మగవారెలా ఉన్నారు ? ఈ మనిషి యిప్పట్లో నా ఆటలేమీ సాగనిచ్చేటట్టు లేదు వచ్చే ఏటికి పరీక్షకి కూచుంటే ఇప్పుడు ప్యాసైనంత లెఖ్ఖ జవాబు రాస్తారుగా ?

మధుర, భాగ్యవతి

ఆనందపరవశాలతో నా హృదయం నిండి పోయింది వంచించబడవలసిన ఒక అమాయకురాలు మంచివాడి పంచన చివరకు క్షేమంగా చేరుకున్నందుకు, అందులో అంతో ఇంతో నా భాగం ఉన్నందుకూ నా మనసు ఉప్పొంగి పోయింది వెంటనే జవాబు రాశాను.

చిరంజీవి సౌభాగ్యవతి మధురకు—

నా ఆనందాన్ని మాటలలో రాయలేను మావారి పేరువలె స్వరూపమూ హృదయమూ 'మనోహరం' గా ఉన్నందుకు ఎంతగానో ఆనందించాను మీ రిద్దరూ కలకల్లాడుతూ, కిలకిల్లాడుతూ చక్కని కలలా జక్కవ కవలా కలకాలం గడపాలని నా కోరిక కనులకీ, మనసుకీ విందైన, విందైన మీ ఛాయాచిత్రానికి నే నిచ్చే వ్యాఖ్య ఏమున్నది! అయినా నాకు తోచిన రెండు చరణాలు రాయకుండా ఉండనేను.

'సరసిజ దినకర
సమాగమం !
మధుర మధురం
మనోహరం !'

మనసా దీవించు, మంజుల.

'మధుర నుంచి శుభలేఖలాంటిది ఏమైనా వచ్చిందిటండీ ?' ఆయన్నడిగాను

'మధురో, బృందావనమో నాకు తెలీదు గాని ఏదో ఒకటి వచ్చింది అప్పుడే మీ అన్నయ్యకు బాగా ఎక్కువగా ఉంది కూడా నీకేమని తిప్పి పంపను ?'

'పోన్లెండి, ఆ అమ్మాయి వెనక రాసిన ఉత్తరం మీరు చూశారుగా, యిదీ చూడండి మొల్తానికి పాపం అదృష్టవంతురాలే చదివారా ? ఇది నా జవాబు కూడా చూడండి ఎలా ఉంది ?'

'బాగుండకేం, నలభీమ పాకంలో పడింది కావ్య ఖాద్యం ఆ అమ్మాయి ఉత్తరం షర్బత్‌లా ఉంటే నీ జవాబు ఐస్‌క్రీమ్‌లా ఉంది ! ఇంతకీ అందరూ అదృష్టవంతులే ! నా దగ్గిర తప్ప ఎక్కడేనా ఒలుకుతాయి నీకు నవరసాలూనూ !' అన్నారు ఆయన అలకగా అలవోకగా చూస్తూ 'ఎందుకలా అంటారు ? మీకన్న నా కెవరున్నారని ?'

అంటూంటే ఆయన నా కళ్ళలోకి చూస్తూ దగ్గిరగా జరిగారు ఇంతలో వదిన పక్క గది తలుపు గడియ తీసినట్టు చప్పుడయింది

'ఏడిసినట్టే ఉంది' అనుకుంటూ ఆయన చటుక్కున నన్ను వదిలేసి వీధిగదివైపు గబగబ వెళ్ళిపోయారు.

*　　*　　*

వదిన సంగతి ఆయనతో సాకల్యంగా చర్చిద్దామని ఏరోజు కారోజు అనుకున్నానేగాని ఏదో ఒక అవాంతరంవచ్చి అలా అలా అనుకోకుండా ఆలశ్యమై పోయింది అదిగాక ఉద్యోగానికి అప్లై చేయవలసిన కాలపరిమితి ఇంకా ఇరవై రోజులపైగా ఉండడంవల్ల దాన్ని గురించి గట్టిగా శ్రద్ధగా ఆలోచించడమే జరగలేదు ఇవన్నీకాక ఆయన మళ్ళీ మొదటికొచ్చి అస్తమానూ క్లబ్బులో గంటలకొద్దీ పేకాట వేసుకోడం, ఆ హరిగోపాల్‌ని వెంటేసుకు తిరగడం—వీటివల్ల ఆయన ఇంట్లో ఉండడమూ ఉన్నప్పుడు నే నాయన్ని కలుసుకుని మాట్లాడ్డమూ జరగనేలేదు ఆ రోజుల్లో అనుకోకుండా ఒకనాడు విచిత్రమైన సంఘటన జరిగింది

మధురిమతోపాటు పిల్లలిద్దరూ ఆటకి వెళ్ళిపోయారు వదిన వంటింట్లో ఏదో పని చేసుకుంటోంది ఆయన లాంబ్రెట్టా ఎక్కి ఆఫీసుకి వెళ్ళి గంట దాటింది సరళతో మాటాడుదామంటే ఆమె ఏ పెరట్లో ఉందో ఎక్కడా వీధివైపుఉన్న అలికిడి లేదు డ్రాయింగురూంలో కూచుని ఆయన పుస్తకాలు ఒక క్రమంలో సర్దుతున్నాను తలెత్తి చూసే సరికి ఎంతసేపైవచ్చాడో హరిగోపాల్ వచ్చి అక్కడ మంచుని నన్ను నిశితంగా పరీక్షించడం కనిపించింది నేను పమిట నిండుగా కప్పుకొని సర్దుకుని కూచున్నాను బొత్తిగా అసభ్యంగా ఉంటుందని 'కూచోండి' అన్నాను. అతడలా దూరంగాఉన్న కుర్చీలో కూచుంటూ అదోలా నవ్వుతూ అన్నాడు. 'థ్యాంక్సు అమాత్రం అంటారో లేక 'ఆయన లేరు' దయచెయ్యండని పరోక్షంగా సూచిస్తారో అని భయపడ్డాను

'అయితే ఆయన ఇంట్లోలేరని మీకు తెలుసున్న మాట ?'

'తెలుసుకునేగా వస్త ?'

నేను కుర్చీలోంచి లేచి కోపంగా మంచున్నాను.

'తొందరపడకండి, కూచోండి'

నేను కూచోలేదు గది తలుపులూ, కిటికీ తలుపులూ తీసేసి వచ్చేశాను అతడు వికృతంగా నవ్వేడు.

'ఎందుకంత భయం?'

'భయంకాదు, జాగర్త'

'ఎందుకనో ?'

'మీకు చెప్పవలసిన అవసరమేమీలేదు. అయినా

మీరేం చెయ్యలేరని నాకు తెలుసు. నడివీధిలో మా ఇల్లు ఉంది. పట్టపగలు సూర్యకాంతి ఉంది కూతవేటు దూరంలో అపవర్గం నాకుంది. ఇవన్నీ కాకుండా నిప్పులాంటి నీతి నాకుంది'

'ఇన్నిటినీమించి మీ దగ్గిర మరొకటుంది. రోజు రోజుకీ మోజుల మోసులెత్తించే, ముగ్ధుల్ని చేసి మత్తెక్కించే సమ్మోహనకర సౌందర్యం ఉంది. ఇంకా మీరు ఎగిరెగిరి మొల్ల మొగ్గలు కోస్తున్నట్టే ఉంటుంది, నా కళ్లకి!'

'హరిగోపాల్?' అరిచాను నేను

'హద్దు మీరుతున్నారు మీరు మంచీ మర్యాదా మీరు ఒదులుకున్నారేమోగాని మాకింకా ఉన్నాయని మరచిపోకండి నాలుగు అని మరి నాలుగు అనిపించుకుంటే మీకు కలిసివచ్చేదేముంది? దయచేసి వెంటనే వెళ్లిపొండి'

'వెళ్లిపోడనికి రాలేదు'

'అయితే నేనే వెళ్ళిపోతున్నాను'

'అలా మీరు వెళ్లలేరు కూడా!'

నేను ఆశ్చర్యంతో అక్కడే నిలబడిపోయాను

'అన్ని రకాల దురదృష్టాలూ కమ్ముకొనివచ్చి అత్యంత దయనీయమైన స్థితిలో హృదయ విదారకమైన పరిస్థితిలో ఉన్నాను నేను చిన్నప్పట్నుంచీ తెలిసినందుకు మీరేం చేశారు? నా కన్నీరు తుడిచారా? ఒక్క సానుభూతి వచనం, ఒక్క జాలి కలిగించేమాట మీనోటినుంచి వచ్చిందా? పైగా పరిహసిస్తారా? ఫక్కుమని నవ్వుతారా? అదృష్ట దురదృష్టాలకు మనమే అధిపతులం కామనీ, మీరీనాడు భోగ భాగ్యాలతో తులతూగుతూంటే అది మీ స్వప్రయోజకత్వంకాదనీ, గ్రహించలేక బాధిత హృదయాలను అవమానిస్తారా? ఉనురు తగిలితే పూరికే పోదనీ, ఉడికిస్తే ఊరుకోలేమనీ ఊహించలేరా?' నాకు జవాబు చెప్పడానికి ఏమీ తోచలేదు మలినమైన మనస్సుతో కుర్చీలో కూలబడ్డాను

'ఆనాడు రైల్లోనే అదృష్ట దురదృష్టాల ప్రసక్తి తెచ్చినన్ను గాయపరచారు నాలుగు రోజుల క్రితం మేమిద్దరం ఇలా ఈ గదిలోనే కూచుని ఉండగా నాకు కవలలు కలిగేరని విరగబడి నవ్వేరు అతి సామాన్యమైన ఆ విషయంలో అంతగా నవ్వడానికేముంది? ఆ తరువాతి విషాద వార్తకి కూడా మీకు నవ్వే వచ్చిందా? పురిటి నాల్గవరోజున నా భార్య వెంకటురత్నం నాలం కమ్మి చనిపోడం కూడా మీకు ఆహ్లాదకరమేనా? ఇందరు పిల్లల్ని సాకలేక పోషించలేక ఒకనాడు తినీ, ఒకనాడు పడుకునే నేనిలా బతకడం మీకు నవ్వులాటగానే ఉందా?'

ఆయన భార్య చనిపోయిందన్న విషయం నాకు తెలియదు ఆ మాట వినగానే నా హృదయం విలవిల లాడింది సంగతి సందర్భాలు తెలుసుకోకుండా ఒకర్ని పరిహసించి బాధించినందుకు పరిపరివిధాల నొచ్చుకున్నాను ఆ సంగతి బహిరంగపరచడానికి కూడా నా కెటువంటి అభ్యంతరమూ లేదు. కాని హరిగోపాల్ నాకు ఆ అవకాశం ఇవ్వలేదు.

'నే నిటువంటి పరిస్థితిలో ఉండడానికి అంతో ఇంతో కారకులైన మీరు నన్ను అవమానపరచిన విషయం జన్మలో మరచిపోలేను'

'మీరే చెబుతున్నారుగద ఒకరి దురదృష్టాదృష్టాలకు మరొకరు కర్తలు కారని, అటువంటిది మీ పరిస్థితికి నేనెలా బాధ్యత '

'నేను మీనుంచి ఏమీ వినాలని రాలేదు. మీకు చెప్పాలనే వచ్చను మీరేదో నవ్వాలనూ, మళ్ళీ పోవాలనూ నిర్ణయించుకుందామని అనుకుంటున్నా



# యువకులు ఫిలిప్స్‌ను అభిలషిస్తారు

యువకులు ఫిలిప్స్‌ను అభిలషిస్తారు . చురుకైన ఆటగాళ్లు, విద్యార్థులు . చాలామంది స్నేహితులు గల విలాసవంతులు . .మంచి భవిష్యత్తును ఆశించే యశస్కాములు. ఒక్కమాటలో చెప్పాలంటే మీవంటి యువకులు .ఫిలిప్స్ ఎందుకు? వాళ్ళే అంటారు మీతో ఫిలిప్స్ దిట్టంగా ఉంటుంది. (ఇది అసలైన టెంపర్ ఉక్కుతో తయారైంది). ఎంత చెడతొక్కినా తట్టుకోడానికి వీలుగా ఉంటుంది. ఇంకా ఫిలిప్స్ అందంగా ఉంటుంది. దీని స్నిగ్ధత, గంభీరత సంస్కృతిని ప్రతిబింబిస్తాయి. విశిష్టకరమైన బైక్. మొత్తంమీద నేటి చురుకైన యువకులకు ప్రత్యేకంగా విధానింపబడినది.

మీరు
**ఫిలిప్స్‌ను**
అభిలషిస్తారు




టి. ఐ. సైకిల్స్ ఆఫ్ ఇండియా అంబత్తూరు, మద్రాసు-53.
(ప్రొప్రైటర్స్ : ట్యూబ్ ఇన్‌వెస్ట్‌మెంట్స్ ఆఫ్ ఇండియా లి॥ మద్రాసు.)

అశాంతిని నెలకొల్పిన మీకు సుఖశాంతులు దూరం చెయ్యనిదే నాకు మిగిలేదేమున్నది? తొక్కత్రొక్కబడిన వల్లితాచులో పగ తప్ప రగిలేదేమున్నది? అనాలోచిత మైన ఆడదానినవ్వవల్ల అన్నదమ్ములే నరుక్కుచచ్చిన భారత కథ మీకు తెలీదా? మీరేదో చెప్పబోతున్నా రేమో, అనవసరం మిమ్మల్ని రక్షించే భీమ పరాక్రమవంతు డెవడూ ఇక్కడలేడు! మీరు చేసిన పనేచేసి మిమ్మల్ని అవమానపరుద్దామని నేను రాలేదు ముందు ముందు మీ మార్గం ఎంత కంటకావృతమవుతుందో వివరంగాచెప్పి, ఆ మాటలు చెబుతున్నపుడు మీ ముఖం ఎంత చక్కగా ఉంటుందో చూసి ఆనందిద్దామని వచ్చాను!'

నోట మాటరాక నేనలా చెవు లప్పగించి కూల బడిపోయాను 'ఏదో ఉద్యోగం చేద్దామనీ, ఎవర్నో ఉద్ధరిద్దామనీ తమరు ఆశిస్తున్నట్టు వూరంతా ఒక వార్త. భార్యను ఉద్యోగం చేయనిచ్చి తనతో సరిసమానంగా ఆదరించే సంస్కారం ఎంతమంది మొగాళ్లకుంటుంది! అందులో మీవారికా? మీతో సరదాగా గడుపుదామని తప్ప అతని కింకేం తెలుసు? దానికి అన్ని విధాలా ఆటంకపెట్టే మీ ఉద్యోగానికి అనుమతిస్తారా? ఒకవేళ ఏమాత్రం ఒప్పుకునే సూచనలు కనబడినా నేను పడనిస్తానా? ఏం మంజులగారూ, వీడు కూడా ఒక మనిషేననీ, అంతో ఇంతో చేతనైనవాడనీ ఇప్పుడైనా మీరు ఒప్పుకుంటారా? ఇప్పటికైనా మీరు క్షమాపణ చెప్పుకుంటారా?'

'ఛీ! ఇదివరకు ఏమైనా జాలి కలిగినా ఇప్పు డంతా తుడిచి పెట్టుకుపోయింది నీకు జరిగిం దంతా నీలాంటివాళ్లకు తగిందే అనిపిస్తోంది ఇంత సేపూ నీతో మాటాడినందుకు నాకెంత సిగ్గులేక పోయిందా అనిపిస్తోంది ఇక నువ్వు కదలకపోయినా నేను లేచి వెళ్ళిపోతాను నీలాంటివాళ్లని చేర దీయడం ఆయన చేసిన తప్పేమోగాని నువ్వను కున్నంత బలహీనులు మాత్రం ఆయనకాదు' సరిగా నే నా మాట అంటూంటే ఆయన చాటుకు వచ్చి నిలబడడం అతను గమనించలేదుగాని నేను గమనించాను ఆయన నన్ను మాటాడవద్దని సంజ్ఞ చేశారు హరిగోపాల్ వూరుకోలేదు

'మీ శ్రీవారేదో సగధీరులూ, మగవీరులూ అని నీ ఉద్దేశం కాబోలు అది నేను వాయించని మద్దె లేంకాదు ఆ బుద్ధి కేవలం ఒక కాగితమ్ముక్క కావలసిన లీరులో కత్తిరించడం నాకే తెలుసు! ఆ హృదయం కేవలం ఒక చిన్న ముద్ద కావలసిన పోలలో కరిగించడం నాకే తెలుసు'

'నీ స్నేహం కేవలం పయోముఖ విషకుంభం తగిన రీతిని సంస్కరించడం నాకే తెలుసు!'

ఎడంచేత్తో జుట్టు ఎట్టుకుని కుడిచేత్తో ఆయన కొట్టబోయారు ఆవేళకి వారు వస్తారని అతడు కలలో కూడా అనుకొని ఉండడు భయాం దోళనలతో గజగజ వణికిపోయాడు నేను అడ్డుపడి విడిపించాను వాడు త్వర త్వరగా పారిపోయాడు

'పనికిమాలిన వెధవ! వాడిని కూచోపెట్టు కుని మాటాడిందేకాక, వెనకేసుకు వస్తావు కూడా దేనికి?'

'అలా చేసిన దెవరో తత్ఫలితమేమిటో ఆ లడి గినవారే ఆలోచిస్తే సరి! ఆయన వెలవెలపోయారు!

## నం ఎంగిలూ సన్నజాజులూ

ఇంత సులువుగా ఈ సమస్య తీరినందుకు తేలికగా హాయిగా వూపిరి పీల్చాను.

* * *

అనుకోకుండా ఆవాళ సాయంకాలం ప్యాసెంజర్లో కామేశ్వరి దిగింది వదిన్ని చూడ్డానికి మళ్లీ మంచిది కుదరదుటూ, అందుకూ లేని పోని గొడవలు ఏంతెచ్చిపెడుతుందోనని నా గుండె పీచు పీచుమంటూనేఉంది కాని ఏమాట కామాటే చెప్పుకోవాలి, ఈసారి అదేమోగాని ఆ ఇల్లాలు ఉన్న జాడా కన్నజాడా తెలీదు. ఆ పరామర్శ ఏదో అయిందనిపించుకుని ఎంత బలవంతపెట్టినా ఉండ కుండా ఆ మర్నాడే వెళ్ళిపోయింది పైగా మనిషి కూడా ఏదో ఏదో దిగులుపడ్డట్టూ దెబ్బతిన్నట్టూ ఉందేగాని మునపటి హెచ్చరిక కనుపించలేదు ఆ తరువాత పదిహేను రోజులకి వసుంధరనుంచి వచ్చిన ఉత్తరాన్నిబట్టి తప్ప అసలు సంగతి బయట పడనేలేదు

అయినా ఈ కామేశ్వరి చేసిన పనులుమాత్రం ఏం బాగున్నాయ్? పినతల్లి కనక మహాలక్ష్మమ్మ

"ఏమండీ నేను అందంగా లేనూ?" పెళ్లయిన యిరవై సంవత్సరాల తరువాత భార్య భర్తని అడిగింది.

"నీ అందం రోజురోజుకీ ఎక్కువవుతోంది గానీ, బుద్ధి క్షీణిస్తోంది. అందుకే అలా అడిగావు" అన్నాడు భర్త.

సన్యాసి ఫకీర్ (హైద్రాబాదు)

గారిని తీసుకుని 'ఎవ రెక్కువ కట్నం ముందుగా ఇస్తే వారికి మా తమ్ముడి సంబంధం ఖాయపరుస్తాం అని వూరూరా తిరిగింది ఆఖరికి ఒక అమాయకుడు వీళ్ల ఉచ్చులో తగులుకున్నాడు పిల్లని చూసి తనకి నచ్చితే తమ్ముడికి నచ్చినట్టే అని చెప్పి, తన తల్లి మంచాన పడిఉంది గనుక, రాలేదు గనుక, తల్లి దండ్రులు తన్ను పంపించారని చెబుతూ సంబంధం ఖాయపరచి పెళ్లికూతురికి ఒక ఖరీదైన చీరపెట్టి తాంబూలాలు పుచ్చేసుకుంది అంతేకాదు 'మేం నగలు చేయించాలని' చెబుతూ పదివేల కట్నంలో సగం అయిదువేలూ ముందు పుచ్చేసుకుంది అంతే మెద్రాసు వచ్చేసింది మరి మాటాడదుట! పిల్ల తండ్రి ఎన్ని ఉత్తరాలు రాసినా సరే ఉలుకూ పలుకూ లేదట!

'మీరువెళ్లి ముహూర్తం పెట్టించి రాస్తా నన్నారు అలా రాయలేదు పోనీ మేమే ఎన్ని ముహూర్తాలుపెట్టి రాసినా మాటాడరు మేము మా పిల్ల వివాహ విషయంలో వరకట్న నిమిత్తం ఇచ్చిన రు 5000/— (అక్షరాలా అయిదువేల రూపాయలు) మీరు ఈ సంబంధాన్ని రద్దు చేసుకునే పక్షంలో తిప్పివంపగోరెదము' అని రాశాట్ట ఆఖరికి.

...శ్వరి ఏమీ శ్రమ ... ఆ ఉత్తరం అలా మొగుడికి చూపించి నవ్వుతూ అంటుందిట

'ఏమండీ, ఈ ఉత్తరం ఖరీదెంతో తెలుసా అయిదువేల రూపాయిలు!'

'అదేమిటి?' అన్నాడు గవరయ్య ఏమీ ఎరగ నట్టు

'ఇన్నాళ్లూ సొమ్ము తిరిగి పంపాలేమోనని బెంగ కూడా ఉండేది ఇప్పుడు ఆ బాధలేదు ఎంత తెలివి తక్కువ వాడుకాకపోతే ఆ సంజీవరావుగాడు 'వర కట్న నిమిత్తం' అని స్పష్టంగా రాసుకుని సంతకం చేసుకుంటాడూ? పుచ్చుకోడంతోపాటు కట్నం ఇవ్వడం కూడా చట్టం ప్రకారం నేరం అని తెలియదు కాబోలు! ఇంకా ఏమని అడగ్గలడు? ఏ మోహం పెట్టుకుని కోర్టు కెళ్లగలడు? ఇక ఈ సొమ్ము మనదే!' అంది తృప్తిగా మొగుడి కళ్లలోకి చూస్తూ.

మరొక నెలా రెణ్ణెల్లు పోయాక ఒకనాటి మిట్ట మధ్యాన్నంవేళ గవర్రాజుగారు బట్టతల పట్టుకుని లబో దెబోమంటూ ఇంటికొచ్చిపడ్డాడు

'ఇంకేముంది! ధరలు పడిపోయాయి! కాంపిటిషన్ పెరిగిపోయింది! పూర్తి నష్టం వచ్చేసింది. మన మీమధ్య పెట్టిన షేర్లు సర్వ నాశనమే. ఇక దివాలాతప్ప మరొక మార్గంలేదు ఇంతకీ ఆ దిక్కుమాలిన సొమ్ము కొంపలో చేర్చొద్దే అంటే విన్నావుకావు అదొక్కటే అయితే బాధలేదు!'

'ఏమిటండీ బాబూ!'

'అదేనే మీ తమ్ముడుగాడికి కట్నమని అయిదు వేలూ అంకించుకొచ్చావుకావూ? అనుకోని నష్ట మొచ్చేసి అవన్నీ నష్టేట్లో కలిసిపోయాయికావూ?'

'కావు కావు మంటారెందుకు కాకిలాగ? నాతో చెప్పకుండా ఆ సొమ్ము ముట్టుకోడానికి మీకెలా చేతులు వచ్చాయీ అంట! స్త్రీధనం కదా అగ్గి ముట్టుకుంటే మీ చేతులు భగభగ మండిపోలేదా అంట?'

'ఏమో మరీ వాటితోపాటు నీ కట్టుకోవాలని పేరూ, పది పేటల పలకసర్లూ కూడా స్వతంత్రించి వ్యాపారంలో పెట్టేశానుకాను మరీ! అన్నీ చల్లగా గంగా ప్రవేశం అయిపోయాయిగాని నా చేతులేం కాలినట్టులేదు!'

మొగుడిమాట నిజమో అబద్ధమో అని కామేశ్వరి అతి ఆతృతతో ఇనప్పెట్టి చూసింది బ్యాంక్ ఎకౌంటు చూసింది ఎక్కడా సొమ్ములేదు. సొమ్ములూలేవు! అంతకంటె ప్రాణప్రదంగా దాచు కున్న ఆ ఉత్తరమూలేదు!

'అన్నట్టు వచ్చేస్తూంటే ఇవాళ ప్లీడరు కని పించాడు వాళ్లు నీమీద దావా చేశారుట!'

కామేశ్వరి వలవల ఏడుస్తూ భర్తకాళ్లమీద పడింది

'నన్నెందుకు ఇంకా ఏడిపిస్తారు? ఇందులో ఎంత నిజం? ఎంత అబద్ధం?'

'అన్నీ అబద్ధమే ఒకటితప్ప వాళ్లసొమ్ము వాళ్లకు పంపేసి పదిహేను రోజులు అవుతుంది ఇదిగో రసీదు ఇలాంటి బుద్ధితక్కువ పనులు ఇంకెప్పుడైనా చేశావా, నన నీమీద వేటు ఎట్ట గలను!'

అని అతగాడు 'గురజాడ అప్పారావుగారి' అడుగు జాడల్లో 'గవరయ్యా, నీసరి మరి ఎవరయ్యా!' అనిపించుకున్నాడుట.

అవాళ కావాలని పిల్లల్ని వస్టుపోకి సినిమాకి పంపించేశాను పరళనిచ్చి వదినని కూడా పంపుదా మని చూశానుగాని నేను రాకపోతే తనూ రానంది భోజనాలూ పనులూ అయిపోగానే వదిన క్రింద ఏదో చదువుకుంటూండగా నేను మేడమీదకు వచ్చేశాను. ఆయన చెవిని ఆ ఒక్క ముక్కావేసి ఆమోదముద్ర పొందుతే ఇక ఏ గొడవా ఉండదని ఆయన ఇటు తిరిగి,

'దారితప్పి వచ్చినట్టున్నావే, ఇవాళ ఇంత పెంద లాళే!' అన్నాడు.

'ఎందుకెప్పుడూ ఏదో ఒకటి విరసంగా విసురుతూనే ఉంటారు! నేను బాధపడుతూంటే చూసి ఆనందించాలని ఉంటుందా మీకు? నేను ఇక్కడికి రావడం దారి తప్పడం ఎలా ఔతుంది?'

'మామూలు మాటకి అంత జవాబు దేనికి?'

'అదికాదు మీతో ఒక ముఖ్య విషయం మాట్లా డదామని వచ్చేను గదిలోకి వెళ్లి మాటాడుకుందాం రండి వదిన వినడం నా కిష్టంలేదు, అసలే మనవి చిన్న గొంతుకలు కూడా కావు!'

ఇద్దరం గదిలోకి వెళ్ళిపోయాం నేను తలుపు దగ్గిరగా లాగి లోపల గడియ వేసేశాను మరచెం బులో నీళ్లు కంచు గ్లాసులో పోసుకుని కడుపు నిండా తాగి కొంగుతో మూతి తుడుచుకుంటూ మొదలెట్టేను.

'మరేంలేదు. వదిన గురించండీ!"

'ఏమిటి?'

'ఆమె భవిష్యత్తు మాట ఏమిటంటారు?'

'ఎవరేమనగలరు!'

'అంటే?'

'అది ఆమె స్వవిషయం ఆవిడ స్వయంగా ఆలోచించుకోవలసిన విషయం'

'అంతేనా?'

'కాక?'

'అందులో మన బాధ్యత ఏమిలేదా?'

'మనదా?'

'అవును. అందులో మనం చేసేదీ, చెప్పేదీ ఏంలేదా?'

'దానికేం, ఆవిడ అడుగుతే మనకి తోచిన సల హాలు ఇవ్వడంలో మాత్రం తప్పేమిలేదు'

నల్లని మేఘాలు కమ్ముకు వస్తున్నట్టు నాకు అనిపించింది.

'అదేమిటండీ, అంత చిత్రంగా మాటాడు తారు! మన సంసారానికి వదిన ఆ సంసారం తోడైతే భరించడం కష్టమనేనా?'

'ఒక సంసారానికి ఇంకోటి తోడైతేకదా! ఎంత ఇబ్బంది అయినా ఈ రెండు మూడు నెలలేగదా!

'అంటే మీ ఉద్దేశం?'

'దీనికి పెద్ద ఉద్దేశానికేముంది మంజూ! ఇంకా ఇంకా ఆవిడ ఇక్కడెందుకుంటుందో మన మెలా ఉండమంటాం?'

నా తల గిర్రున తిరిగినట్లయింది

'అదేమిటండీ, అలా అంటారు! ఇక్కడుండక పోతే ఆ నిర్భాగ్యురాలు ఇంతింత పిల్లల్ని తీసుకుని ఎక్కడికి పోతుంది?'

"ఏమో అది ఆమె జవాబు చెప్పుకోవలసిన విషయం'

'మనమేం చెప్పవలసిందిలేదా?'

'ఎందుకు మంజూ, మళ్లీ మళ్లీ అడుగుతావ్? ఆమెకు మనం ఎవరం? పుట్టింటి వాళ్లమనా, అత్తింటివాళ్లమనా? మనకు జవాబు చెప్పవలసిన అవసరమూ, బాధ్యతా ఏమున్నాయ్? ఇవన్నీ పెద్ద పెద్దవాళ్లు చూసుకోవలసిన విషయాలు. ఇప్ప టికే మన శక్తీ వయసూ మించిన పనులు చేశాం. భారమైన బాధ్యతలు నెత్తిన వేసుకుని వయసులో ఉన్న నాలుగు రోజులూ ఇలా వృధాగా గడపడాని కేనా? ఎవళ్లనో ఎందుకో ఉద్ధరిద్దామనుకుంటూ, వెర్రి మొర్రి ఆలోచనల్ని పెట్టుకుని యవ్వనాన్నీ కాలాన్నీ ఇలా పాడు చేసుకోడానికేనా? మంజూ నీ వయసెంత, నీ ఆలోచనల వయసెంత? ఇలా నన్నెంతకాలం భరించమంటావు? సహించడానికి ఒక హద్దంటూ ఉంటుంది అది దాటిపోతే ఇక ఎంత దుఃఖపడినా పోయినది రాదు సుమా! ఈమధ్య ఎప్పుడూలేంది నీకై నువ్వు నడిచి మేడెక్కి వచ్చావు నీ గాజుల చేతితో తలుపు గడియవేశావు. ఎందుకో అనుకున్నాను, ఇందుకా, ఈ ముసిలి కబుర్లు చెప్పడానికా?'

(సశేషం)

## రచయితలకు మనవి

మా కార్యాలయం చేరే ప్రతి రచనతోనూ దాని రచయితగాని, రచయిత్రిగాని అది తమ స్వంత రచనేనని, దేనికీ అనుకరణ కాదని, హామీ వ్రాసి పంపాలి. ఇటువంటి హామీలేని రచనలను ప్రచురణకి స్వీకరించలేము.

సంపాదకుడు

ఆంధ్రసచిత్రవారపత్రిక

# చిత్రలహరి

"ప్రొడక్షన్ నెం. 8" తాలూకు కొన్ని భాగాలి ఇక్కడే షూట్ చేస్తున్నారు.

తెలుగు చిత్రం "ఇల్లాలు" షూటింగు దాదాపు ముగిసినట్లే. పాచ్‌వర్క్ మాత్రం మిగిలిఉన్నది. ఈ చిత్రంలో వచ్చే ఫ్లాష్‌బాక్ అంతా ఈస్ట్‌మన్ కలర్‌లోను, మిగతాదినలుపు, తెలుపుల్లోనునిర్మించారు. రవికాంత్, గీతాంజలి, చలం, రామకృష్ణ, ధూళి పాళ, ప్రభాకరరెడ్డి, నిర్మల, జూనియర్ భానుమతి మొదలయినవారు నటించిన యీ చిత్రానికి సంభాషణలు ముళ్లపూడి వెంకటరమణ రూపొందించారు. గీతాలు : ఆత్రేయ, శ్రీ శ్రీ, కొసరాజు వ్రాశారు. సంగీతం : కె. వి. మహదేవన్, కళ : తోట, కెమెరా : కె. ఎస్. ప్రసాద్, కూర్పు, దర్శకత్వం : వి. సంజీవరావు, దర్శక పర్యవేక్షణ, నిర్మాత : శ్రీ ఎల్. వి. ప్రసాద్. ఆంధ్రలో యిది పూర్ణాపిక్చర్స్‌వారి ద్వారా జులై మాసంలో విడుదల కాగలదని తెలుస్తున్నది.

## శ్రీధర్ హిందీ చిత్రం

ప్రసిద్ధ కథకుడు, దర్శక, నిర్మాత శ్రీ సి. వి. శ్రీధర్ తన 'కాదలిక్క నేరమిల్లై' తమిళ చిత్రాన్ని హిందీలో పునర్నిర్మించే ప్రయత్నాలు చేస్తున్నారు. (ఈ చిత్రాన్నే పద్మశ్రీ వారు "ప్రేమించి చూడు" పేరుతో తెలుగులో తయారుచేశారు). ఇందులో కాంచన పోషించిన భూమికను హిందీ చిత్రంలో కుముద్ చౌద్వి అనే కొత్త నటి (పూనమ్ కి రాత్ ఫేమ్) పోషిస్తుందిట ! రచన : రాజేంద్రకిషన్, సంగీతం : ఎస్. డి. బర్మన్, నిర్వహిస్తారు. మిగతా నటీనటులను కూడ త్వరలోనే ఎన్నికచేసి మే నెలాఖరునుంచి సెట్స్‌కు వెళతారు. మద్రాసులోనే ఈస్ట్‌మన్ కలర్‌లో తయారవుతుంది యీ చిత్రం.



"సింగపూర్ సి. ఐ. డి"తో సరోజాదేవి

## చిత్రలహరి

### ...విచంద్ర ఫిలిమ్స్

...విచంద్ర ఫిలిమ్స్‌వారు పిల్లల చిత్రం ఒక ...నిని నిర్మించనున్నట్లు తెలుస్తున్నది విద్వాన్ ...శ్రీ రచన చేస్తున్నారు సంగీతం దర్శకత్వం ...స్. రాజేశ్వరరావు నిర్వహించే యీ చిత్రానికి ...ర్శకుడు : లక్ష్మీకుమార్‌రెడ్డి ఎం ఏ. ఎల్ ఎల్. ..., బి ఇడి. నిర్మాత · కె ఎల్ చౌదరి ఉత్సాహ...ంతులైన బాలలకు యీ చిత్రంలో చక్కని అవకాశం యిస్తారుట!

### జెమినీచిత్రం

జెమినీవారు—వారి "జిందగీ" హిందీ చిత్రం ఆధారంగా నిర్మిస్తున్న తెలుగు చిత్రం నిర్మాణం పూర్తయింది. ఎన్. టి. రామారావు, దేవిక, గీతాంజలి, ఎస్. వి. రంగారావు, కాంతారావు, పద్మనాభం ముఖ్య భూమికలు పోషించారు. సంభాషణలు : ఆత్రేయ, గీతాలు : సి. నారాయణరెడ్డి, ఆత్రేయ, సంగీతం : విశ్వనాథం, రామమూర్తి, నృత్యాలు : వెంపటి సత్యం, కెమెరా : ఎల్లప్ప, దర్శకత్వం : వేదాంతం రాఘవయ్య, అల్సేషియన్ డాగ్ సాహస కృత్యాలు ఈ చిత్రంలో ఒక ప్రత్యేక ఆకర్షణ అని తెలుస్తున్నది. ఆంధ్రలో యిది నవయుగ ఫిలిమ్స్‌వారి ద్వారా విడుదల అవుతుంది.

—మోహన్ కుమార్ ★

















# అందరికీనచ్చే చలనచిత్రం చంద్రహాస

'విధి బలీయం. దాన్ని మార్చటం మానవ మాత్రులకు సాధ్యంకాదు' అంటాడు మహర్షి భాగురాయణుడితో. భాగురాయణుడు, మానవుని మేధస్సుముందు విధి ఎంత? దాన్ని నేను మారుస్తానంటూ కంకణం కట్టుకుంటాడు.

మహామంత్రి కుమార్తె జాతకంచూసి ఆమె చక్రవర్తిని కాగలదని, ఆమె వివాహం మహామంత్రికి పతన హేతువు కాగలదనీ హెచ్చరిస్తాడు మహర్షి. దురాశాపరుడైన మంత్రి తన కుమారునే మహారాజుని చేయాలనే కోర్కెతో అశుభకారణమైన ఆ పసిబాలికను వధించబోతాడు. భార్య వేడికోలుతో కుమార్తెకు, ప్రేమా, పురుషుడూ అన్నవి తెలీకుండా పెంచటాని కంగీకరించి చంపకుండా వదిలేస్తాడు కేరళ రాజు కుమారుడు చంద్రహాసుని పుట్టినరోజుకి మహారాజు కాహ్వానం వస్తుంది. తనకు ఆహ్వానం పంపిన సామంతునిపై ఆగ్రహిస్తాడు. పేరుకు మహారాజైన కుంతలేశ్వరుడు. తగిన విధంగా బుద్ధిచెప్పి రమ్మని మహామంత్రిని పంపుతాడు. తన కుమారునికి చక్రవర్తి కాగల యోగం ఉందని కేరళరాజు విండు కొలువులో ఎరుక పరుస్తాడు దాంతో మహామంత్రిలో క్రోధం కమ్ముకుంటుంది. మాయోపాయంతో కేరళరాజును సంహరించి చంద్రహాసుణ్ణి చేజిక్కించుకోవాలనుకుంటాడు. కానీ రాణి దాసీ చేతి కిచ్చి చంద్రహాసుని బయటికి దాటించేస్తుంది. తనను నిర్బంధించవచ్చిన వారి చేతికి దొరక్క ఆత్మహత్య చేసుకుంటుంది రాణి. దాసీ చంద్రహాసుని కుంతలానికి తెచ్చికాపాడూ ఉంటుంది ఆమె భర్త వానాడు ఆకస్మాత్తుగా వచ్చి ధనాశతో చంద్రహాసుని మంత్రికి అప్పగిస్తానని పట్టుబట్టాడు. విధిలేక భర్తను హత్యచేసి చంద్రహాసుని కాపాడుతుంది దాసి. హత్యానేరం చేసినందుకు రాజభటులు మంత్రి వద్దకు తీసికెళ్తారు దాసిని. మంత్రి ఎంత ప్రయత్నించినా దాసి చంద్రహాసుని ఉనికిని తెల్పదు. దిక్కులేని వాడైన చంద్రహాసుడు దేవి గుడిలో నిద్రపోతాడు. భార్య ప్రోద్బలంతో దేవి నగలను తీసికెళ్ళిన పూజారి చంద్రహాసునివద్ద కొన్నింటిని జారవిడిచి వెళ్ళటంవలన అతడే దొంగని భటులు చంద్రహాసుని మంత్రివద్దకి తీసికెళ్తారు. కాలికి ఆరువ్రేళ్ళుండటాన దాసి, అమ్మా అని పిలవటంవల్ల అతడే చంద్రహాసునిగా గుర్తించి, కోడెత్రాచులచే కరిపించి చంపమని భటుల నాదేశిస్తాడు మంత్రి. ప్రక్కనేఉన్న మహర్షి అది సాధ్యంకాదని చంద్రహాసుడు మరణించడని చెప్తాడు అలా జరిగినపక్షంలో మునీంద్రుని ఆశ్రమానికి చంద్రహాసుణ్ణి తీసికెళ్ళమంటాడు మంత్రి. మహామంత్రి ప్రయత్నంలో చంద్రహాసుడు మరణించడు. మహర్షి అతన్నితనఆశ్రమానికితీసికెళ్తాడు.

తన ప్రయత్నం విఫలమైందన్న కోపంతో మంత్రి ఇద్దరు తలారులను మునీంద్రుని ఆశ్రమానికి పంపుతాడు. చంద్రహాసుని అరణ్యమధ్యంలోకి తీసికెళ్ళి హతమార్చమని ఆదేశిస్తాడు. కానీ తలారులు చంద్రహాసుని చంపటానికి ఇష్టపడక అతని కాలి ఆరవ వేలినికోసి ఆనవాలుగా తీసికెళ్తారు. మహారణ్యంలో పడిఉన్న చంద్రహాసుని వేటకి వచ్చిన కుళింద రాజు చూచి మహదానందంతో తన రాజ్యానికి తీసికెళ్ళి తనకు పిల్లలులేని కొరతని తీర్చుకుంటాడు. చంద్రహాసు డక్కడ అన్ని విద్యలలో ఆరితేరి పెరిగి పెద్దవాడవుతాడు. పట్టాభిషేకానికిముందు ఆరు నెలలు దేశాటనం చేసి రావాలని బయల్దేరి వచ్చిన చంద్రహాసుడు పురుషు డెట్లా ఉంటాడో తెలియని మహామంత్రి కుమార్తె విషయను యాదృచ్ఛికంగా కల్సుకుంటాడు. క్రమంగా వారి స్నేహం ప్రేమగా మారుతుంది. పరాక్రమశాలియగు చంద్రహాసునికి మంత్రికుమారునికి మైత్రి కుదుర్తుంది. మహారాజు, కుమార్తెకు



'చంద్రహాస'లో హరనాథ్.

తగిన వరుని వెదుకుతుంటాడు కానీ రాకుమారి మంత్రి కుమారుని ప్రేమిస్తుంది మంత్రి కూడా ఆ విషయాన్ని వెల్లడిస్తాడుగానీ మహారాజుకీ, మంత్రికీ వియ్యం కుదరదంటూ నిరాకరిస్తాడు రాజు. కుళింద రాకుమారుని ప్రతిభా విశేషాలను విన్న మహారాజు అతన్ని తన అల్లునిగా చేసుకోవాలని రాయబారానికి మంత్రిని పంపిస్తాడు. కుళింద రాజ్యానికి వెళ్ళిన మహామంత్రి చంద్రహాసుని చూచి, అతని వృత్తాంతం కుళిందరాజు ద్వారా విని అతడే తను వధింపబూనిన చంద్రహాసుడని తెల్సుకుని ప్రతీకారానికి పూనుకుంటాడు. రాజకీయమైన విషయంగాబట్టి రాజకుమారునే పంపాలంటూ, తన కుమారుని కొక లేఖ వ్రాసి చంద్రహాసుని ద్వారా పంపిస్తాడు చంద్రహాసుడు మంత్రి కుమార్తె విషయని కల్సుకొని మాటల సందర్భంలో ఆలేఖను ఆమె వద్దే మరచి వెళ్తాడు ఆలేఖ తన అన్న కని తెలుసుకున్న విషయ ఆత్రంగా చదివి అందులోని చంద్రహాసునిచంపనున్న విషయాన్నిచూచి ఆశ్చర్యపోతుంది. మోసానికి మోసంగా అందులోని విషయాన్ని తెలివిగా మార్పుచేసి తిరిగి వచ్చిన చంద్రహాసుని కిస్తుంది. తండ్రిగారి ఆదేశం ప్రకారం చంద్రహాసునికి, విషయకు వివాహం జరిపిస్తాడు, మంత్రి కుమారుడు. తిరిగి వచ్చిన మంత్రి చంద్రహాసుడు బ్రతికున్నాడనీ, విషయకి అతనికి, వివాహం జరిగిపోయిందనీ విని క్రోధాగ్నితో దహించుకుపోతాడు మహామంత్రి ఏవిధంగానైనా చంద్రహాసుని హతమార్చి తన పంతాన్ని నెగ్గించుకోవాలని చేసిన ప్రయత్నంలో తన కుమారుడ్నే పోగొట్టుకుంటాడు చంద్రహాసుని అంతమొందించే ప్రయత్నం తిరిగి చేయబోతాడుకాని రాకుమారి తన బాకుని విసిరి మంత్రి ప్రాణాలని తీస్తుంది. అనంతరం తన ప్రియుని మార్గాన్ననుసరిస్తుంది. తనమూలంగా ముగ్గురు మరణించటం సహించని చంద్రహాసుడు దేవిని ప్రార్థిస్తాడు దేవి కటాక్షం వల్ల అందరూ పునర్జీవితులై కథ సుఖాంతమవుతుంది.

చంద్రహాసునిగా హరనాథ్ నటన మెచ్చుకోదగిందిగా ఉన్నది. మంత్రి కుమార్తె విషయగా కృష్ణకుమారి చక్కగా నటించింది. విధినే ధిక్కరింపజూచిన మహామంత్రి భాగురాయణుడిగా గుమ్మడి నటన చిత్రానికి జీవం పోసిందని చెప్పవచ్చు దాసి సుగుణగా పండరీబాయి నటన ప్రశంసనీయంగాఉండి ఆ పాత్రకు ఎంతో నిండుదనాన్నిచ్చింది మంత్రి కుమారుడు మదనుడుగా సత్యన్నారాయణ నటన సహజంగా ఉంది. రాజకుమారిగా వాణిశ్రీ నటన పాత్రకి సరిపోయింది ఇంకా కృషిచేసి మంచి నటనను ప్రదర్శించగల అవకాశాలున్నాయి. బాల చంద్రహాసునిగా మాస్టర్ బాబు నటన చూడముచ్చటగా ఉంది రాజ్‌బాబు, రామకోటి, శివరామకృష్ణయ్యల హాస్యం చక్కగా ఉంది. అక్కడక్కడ చిన్న చిన్న పొరపాట్లు దొర్లినా బి యస్ రంగా దర్శకత్వం ప్రతిభావంతంగా ఉన్న దనవచ్చు ముఖ్యంగా మూడు పాటలు వీనులవిందుగా ఉన్నాయి శ్రీ యస్ హనుమంతరావు సంగీతం మనోహరంగా ఉంది హరిదాస్ ఛాయాగ్రహణం కమనీయంగా ఉన్నది. చిత్రాన్ని కత్తియుద్ధాలు, మల్లయుద్ధాలతో నింపటంవల్ల 'మాబ్ ఎట్రాక్షన్' కూడా ఉందని చెప్పవచ్చు ఈ జానపద చిత్రానికి నిర్మాత శ్రీ బి. యస్. రంగా.

—మాధవ్ ★

---

## శ్రీ రామారావు: బ్రిటిష్ పత్రికా ప్రశంస

లండన్‌నుంచి వెలువడే సుప్రసిద్ధ పత్రిక 'అబ్జర్వర్' (25—4—1965 సంచిక)లో నైగెల్ గోస్లింగ్ ఇలా వ్రాశారు.

"పోయినవారం నేను చూసిన పాతపద్ధతి (ఓల్డ్ స్టైయిల్) చిత్రాలన్నిటిలోనూ నాకునచ్చినది ఒక యువ భారతీయుడు వేసినది. ఈ చిత్రపటాన్ని 'ది న్యూ విషన్ గాలరీ'లో ప్రదర్శించారు. తన జాతీయ భావవ్యక్తీకరణంలోని తియ్యని చైతన్యాన్ని చక్కగా వాడుకునే ఇతని చిత్రాలలో వ్యక్తిగతం, వాస్తవం, పాశ్చాత్య స్వభావం కల వివేకం కనిపిస్తుంది"

శ్రీ రామారావుగారి బొమ్మలు, వ్యాసాలు ఆంధ్ర సచిత్రవార పత్రికలో పడ్డాయి ఇటీవలే, వారు అమెరికాకి తరలి వెడుతున్నారనే వార్త కూడా ఈ పత్రిక పాఠకులు చదివే ఉంటారు. ★

# కళాసమితి ఉత్సవాలు

మద్రాసులోని రైల్వే ఉద్యోగులు నిర్వహిస్తున్న సాంస్కృతిక సంస్థ ఆంధ్ర కళాసమితి తొమ్మిదవ వార్షికోత్సవాలను పురస్కరించుకొని ఈనెల 2 వ తేదీన ఐ. సి. యఫ్. థియేటర్‌లో జరిగిన బహిరంగసభలో సుప్రసిద్ధ చలన చిత్ర దర్శకులు శ్రీ కమలాకర కామేశ్వరరావుగారిని సన్మానించారు ఈసభకు సినీనటులు శ్రీ యస్ వి. రంగారావు గారధ్యక్షత వహించారు.

ప్రారంభంలో సమితి అధ్యక్షులు శ్రీ పి సుబ్బరామయ్య అతిథులకు స్వాగతం చెప్పారు కార్యదర్శి శ్రీ బి. రామకృష్ణ తమ వార్షిక నివేదికలో కళాసమితి కార్యకలాపాలను, గత సంవత్సరంలో సాధించిన విశేషాలను ప్రస్తావించారు తెలుగువారు అధిక సంఖ్యలోవున్న పెరంబూరు, రైల్వే ప్రాంతంలో ప్రత్యేకమైన తెలుగు పాఠశాలయొక్క అవశ్యకతను ఆయన తమ నివేదికలో సూచించారు

అనంతరం శ్రీ కామేశ్వరరావుగారికి సన్మానం జరిగింది. సమితి సంయుక్త కార్యదర్శి శ్రీ వీరభద్రరావు సన్మానితులకు పుష్పమాల వేశారు ఇతర తెలుగు సంస్థలవారు పలువురు శ్రీ కామేశ్వరరావుగారికి పుష్పమాలలు వేశారు దర్శకులు శ్రీ కామేశ్వరరావును గురించి శ్రీ భావశ్రీ రచించిన పంచరత్నాలు 'పన్నీటి జల్లు'ను నేపథ్య గాయకులు శ్రీ శర్మ గానం చేశారు కార్యదర్శి శ్రీ రామకృష్ణ, దర్శకులు శ్రీ కామేశ్వరరావుగారి జీవిత విశేషాలను వివరించారు.

వార్షికోత్సవ సందర్భంగా తయారయిన 'వెన్నెల' అనే లిఖిత పత్రికను సుప్రసిద్ధ దర్శకులు శ్రీ బి ఎన్. రెడ్డి ఆవిష్కరించారు

సభాధ్యక్షులు శ్రీ ఎస్ వి. రంగారావు మాట్లాడుతూ, "మా కామేశ్వరరావుగారిని గురించి నేనేం చెప్పగలను?" అన్నారు. శ్రీ కామేశ్వరరావుగారిలాంటి ఉత్తమ దర్శకులకు జరిగే ఈ సత్కారంలో ఎంతో ఔచిత్యం ఉన్నదని ఆయన అన్నారు.

శ్రీ సముద్రాల రాఘవాచార్య మాట్లాడుతూ, కామేశ్వరరావుగారితో తమ పరిచయాన్ని వివరించారు. సినిమాలు అటు ప్రభుత్వ మన్ననమూ, ఇటు ప్రజాదరణనూ పొందటం సాధారణంగా జరగదనీ, కాని శ్రీ కామేశ్వరరావుగారి 'నర్తనశాల' ఆ పనిని సాధించగలిగిందనీ ఆయన అన్నారు.

శ్రీ బి ఎన్. రెడ్డి తమ ఉపన్యాసంలో కామేశ్వరరావుగారు బాగా కృషిచేసి పైకి వచ్చారనీ, సోదర సమానుడయిన మిత్రునికి సన్మానం జరగటం, తాము ప్రసంగించటం ఆనందదాయకమని అన్నారు.

రచయిత శ్రీ దాశరథి ప్రసంగిస్తూ, కామేశ్వరరావుగారి చిత్రాలు ప్రజల హృదయాలను రంజింపచేయగలిగాయనీ, అందువల్లనే అటు ప్రజల అభిమానమూ, ఇటు ప్రభుత్వ ప్రశంసలూ లభించాయన్నారు. సన్మానితులు శ్రీ కమలాకర కామేశ్వరరావుగారు సముచితరీతిన సమాధానమిస్తూ బి. ఎన్. రెడ్డిగారిలాంటి అగ్రగణ్యుల సమక్షంలో తమకీ సన్మానం జరగటం ఆనందదాయకంగా ఉన్నదని, అందరి సహకారమూ, ప్రతిభ తోడు నీడై నిలిచిననాడే ఏ చిత్రం అయినా విశేషమయిన ప్రజాదరణ పొందగలదని అన్నారు. శ్రీ బి ఎన్. రెడ్డిగారు గురుతుల్యులనీ, వారి అభిమానంతోనే తామీనాడు ఈ స్థితికి రాగలిగేమనీ శ్రీ కామేశ్వరరావుగారన్నారు.

విచిత్ర వేషధారణ పోటీలు, శ్రీ మాడుగుల సూర్యనారాయణమూర్తి ఏకపాత్రాభినయం, బ్రహ్మ తారల పాటల ప్రదర్శన మొదలయిన కార్యక్రమాలతో సభ ముగిసింది.

దక్షిణరైల్వే డిప్యూటీ చీఫ్ ఇంజనీరు శ్రీ శ్రీనివాసరావు ఈ సభకు ప్రత్యేకంగా విచ్చేసి వేదిక నలంకరించారు. ఈ సందర్భంలో సమర్పించిన సన్మాన పత్రంలో ఒక పద్యం—

> సాంఘిక చిత్రాల—సామర్థ్య మిదియని
> "గుండమ్మ కథ"లోన గుర్తించి!
> ఆంధ్రుల వ్యక్తిత్వ—మకలంక ప్రభుభక్తి
> "తిమ్మరుసు"నిలోన—దీర్చిదిద్ది!
> వర్ణభేదములేని—వాఙ్మయలక్ష్మిని
> అల "కాళిదాసు"లో—నమర నిల్పి!
> వ్యాస భారతమందు—మోసులెత్తిన ప్రతిభ
> కొమర "నర్తనశాల"—గూర్చి తేర్చి
> రాత్రి పతి బహూకృతులలో— రంజరిల్లి
> సాగిపోతివి "సీమ" ప్ర—శంసనిచ్చి!
> అవుర! ఎంత ధీశక్తి నీ— యందు ప్రబలె!
> మేలి సుగుణాలరాయ! కా—మేశ్వరయ్య!! ★



అంధ్రకళాసమితి ఉత్సవాల సందర్భంలో తీసిన ఈ చిత్రంలో శ్రీయుతులు దాశరథి, సముద్రాల రాఘవాచార్య, యస్ వి రంగారావు, కమలాకర కామేశ్వరరావు, బి. ఎన్. రెడ్డి, శ్రీనివాసరావు, మొదలయినవారిని చూడవచ్చు శ్రీ కామేశ్వరరావుగారి వెనుక ఉన్నది శ్రీ రామకృష్ణ.

# వార్తలు-విశేషాలు

## పద్మశ్రీకి సన్మానం

నార్త్ మద్రాస్ ఆర్ట్స్ ఎకాడమీవారు ఇటీవలనే స్థానిక త్యాగరాయ కళాశాలావరణలో సినీదర్శకులు శ్రీ బి ఎన్. రెడ్డి అధ్యక్షతన పద్మశ్రీ చిత్తూరు వి నాగయ్యకు సన్మానం జరిపారు సభికులకు శ్రీ ఏ ఎం బాలుచెట్టి స్వాగతవచనాలు పలికారు. అధ్యక్షోపన్యాసానంతరం నిర్మాత, దర్శకులు శ్రీ కె. బి నాగభూషణం సంస్థ సావనీర్ ఆవిష్కరించారు. శ్రీయుతులు పి గణపతిశాస్త్రి, జె సత్యనారాయణమూర్తి, సదాశివబ్రహ్మం, ధూళిపాళ సీతారామశాస్త్రి, బి భావనారాయణ, పి ఎస్ పార్థసారథి, ఎం లింగమూర్తి, సి. ఆర్ నారాయణస్వామి ఉపన్యసించారు అధ్యక్షుని ముగింపు వచనానంతరం శ్రీ ఎం వెంకటదాస్ వందన సమర్పణ చేశారు. అనంతరం శ్రీ ఆర్ కామేశ్వరరావు లలితసంగీతం, తిరుమలై సిస్టర్స్ నృత్య ప్రదర్శనం, శ్రీ ఎం ఆర్. తిలక్ మయసభ ఏకపాత్రాభినయాలతో సభికులకు వినోదాన్ని కలిగించారు

## ఆంధ్ర కళామండలి

దక్షిణరైల్వే సిబ్బందికి సంబంధించిన ఆంధ్ర కళామండలివారు 17—4—65 నాడు 'చిల్డ్రన్స్ థియేటర్'లో పద్మశ్రీ నాగయ్యగారిని సన్మానించారు.

కుమారి రాణి, శ్రీ పిఠాపురం నాగేశ్వరరావులు ముందు లలితసంగీతం కచేరీ చేశారు 'కప్పలు' నాటిక తర్వాత ప్రదర్శించారు. మండలి అధ్యక్షులయిన శ్రీ పి వెంకటేశ్వరులు శ్రీ జె వి సోమయాజులుగారిని సభకి అధ్యక్షత వహించమని కోరారు. 'ముఖ్య అతిథులయిన శ్రీయుతులు నాగయ్య, కమలాకర కామేశ్వరరావుగార్లకి కూడా స్వాగతం చెప్పారు. మండలి కార్యదర్శి శ్రీ యు. నాగభూషణం తమ కార్యక్రమాల్ని గురించి ప్రసంగించారు దంతంతో చేసిన 'పద్మశ్రీ' నగిషీ ఒకటి వి నాగయ్యకి బహూకరించటం తర్వాత జరిగింది. తర్వాత శ్రీ కె. కామేశ్వరరావుగారు శ్రీ వి. నాగయ్య

...చుతూ, శ్రీ నాగయ్యగారి నటనా కౌశలాన్ని పొగిడారు. కార్యదర్శి ధన్యవాదాలతో సభ ముగిసింది.

## వైశ్యసంఘం వజ్రోత్సవం

దక్షిణ ఇండియా వైశ్య సంఘం (మద్రాస్) వారు వారి సంఘం వజ్రోత్సవ సందర్భంగా మూడు రోజులు వివిధ కార్యక్రమాల్ని ఏర్పాటు చేశారు. మొదటిరోజు వివిధ క్రీడలలో గెలుపొందిన సభ్యులకు బహుమతిప్రదానం, అనంతరం మద్రాసు విష్ణుప్రియాస్ వారి నృత్య ప్రదర్శనం. రెండవరోజు సభ్యులచే ఊర్వశి అనే పౌరాణిక నాటకం విజయవంతంగా ప్రదర్శించబడింది. మూడవరోజు ప్రతీకారం అనే చారిత్రాత్మక నాటకాన్ని సంఘ సభ్యులు ప్రదర్శించారు. నటీనటులు అందరూ తమ పాత్రల మర్మం చేసుకుని కృషితో చక్కని నటన ప్రదర్శించారు. ముఖ్యంగా 'ప్రతీకారం' లో శ్రీ మనోహర నటన అత్యంత మనోహరంగా ఉంది. శ్రీయుతులు శేషయ్య, సుబ్రహ్మణ్యం మొదలగువారు తమ పాత్రలను మెరుగు దిద్దారు. దర్శకత్వం శ్రీ పి. మోహనరంగం నాయుడు, సంగీత దర్శకత్వం: శ్రీ పి. మంగపతి, శ్రీ డి. రామారావు వహించారు. విరామ సమయంలో శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ వైశ్య మహిళాసంఘాల ఆవశ్యకతను గూర్చి ఉపన్యసించారు.




# ప్రమీలార్జునీయము

దర్శకుడు
**యం. మల్లిఖార్జునరావు**

నిర్మాతలు
**ఆదిబాబు • నాగమణి**

రచన: పింగళినాగేంద్రరావు • సంగీతం. పెండ్యాల • ఛాయ. రవికాంత్, రహిమాన్
కళ. గోఖలే • నృత్యం. పసుమర్తి, హీరాలాల్

**వాహిని విడుదల**

BAKTHA

మైసూరు స్టేట్: శారద మూవీస్, బెంగుళూరు. నైజాం: ఉషా పిలింస్. సికిందరాబాదు.

Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6&7 Thambuchetty Street Madras-1. Phone: 29766 & 23713. Chief Editor S. Sambhu Prasad.



యన్. టి. రామారావు.

—["దొరికితే దొంగలు" నుండి]




అందమైన ముఖవర్చస్సునకు
ఎక్కువ కాలం నిలిచే పరిమళమునకు

రెమీ

టాల్కమ్ పౌడరు

CRITERION RP 581